ఈ సుమతి రాజధాని విశాలానగరమని తెలుపఁబడి యున్నది. మాళవదేశమునకు ముఖ్యపట్టణమగు నుజ్జయినికి విశాలా నగరమను నామమున్నట్లు సుప్రసిద్ధము. ఈమాళవదేశ మాంధ్ర రాజుల వశమందున్నట్లును, పశ్చిమదేశభాగమున నాంధ్ర సామ్రాజ్యప్రతినిధులుగ నున్నవారిలో 'హారితి' కులసంజాతు లున్నట్లును నిదర్శనము లగపడుచుండుటచే నీ సుమతి రాజధాని యీ విశాలానగరమే యని తలంపఁదగియున్నది.

గంగానదికి సమీపమున 'వేశాలి' యను చారిత్రిక ప్రసిద్ధి గల మఱియొక పట్టణము గలదు. ఇది మగధరాజ వంశముతో సంబంధముగల 'లిచ్ఛవి' తెగవారికి రాజధానియైయుండెను. గంగా నదికి తూర్పున ఇరువది మైళ్లదూరమున నున్న యీ 'వేశాలి' యను నదే సుమతిరాజధానిగాఁ జెప్పఁబడిన విశాలానగరమైనచో గంగానదీ ప్రాంతమునందలి యహిచ్ఛత్రపురమునుండి శ్రీకాకుళమునకు వచ్చి నట్లుగాఁ జెలుపఁబడిన ఆంధ్రవిష్ణుదేవుని కథ సుమతి కాకుళమున నాదేవుని తన కులధనముగా గుర్తించెనన్న కథతో సమన్వయము కలదగును. ఆంధ్రవిష్ణువు గంగాతీరమునందలి యహిచ్ఛత్రపురముః నుండి కృష్ణాతీరమునకు వచ్చుటయును, పిదప కలియుగము సంభవిం చుటచే నిచటనుండనొల్లక తిరిగి యహిచ్ఛత్రపురమునకుం జని 'భువిసనాతనధర్మసంపూర్ణమైన పిదప' దానె వుగిడివత్తు నని బ్రహ్మతోఁ జెప్పికొనుటయు మొదలగు గాథ, యాంధ్రు లుత్తరదేశము నుండి వచ్చి దండకారణ్యమున కృష్ణానదీప్రాంతమున నెలకొనిన పిదప, మరల భారతసామ్రాజ్యపాలకులై మగధకుఁబోవుటనుగూర్చి గాని, లేదా బౌద్ధమత విజృంభణము వలన వైదికమతమునకుఁ గలి గిన యడ్డంకులను గూర్చిగాని సూచించుచున్నదనవచ్చును.

గంగాతీరమునందున్న అహిచ్ఛత్ర పురమునకును కృష్ణా తీరమందున్న శ్రీకాకుళమునకు రాకపోకల సంబంధము తెలుచుగా నున్నట్లును, అచ్చటినుండి యనేక బ్రాహ్మణకుటుంబములు వచ్చి

యాంధ్రదేశమున నెలకొనినట్లును, దీనిలోని కథలవలనఁ దెలియుచున్నది. ముక్కంటీశ్వరుఁ డనురాజు (అతఁడే త్రిలోచన పల్లవుఁడు) కృష్ణాతీరమందున్న ("ధరణివరణ నగరము") ధరణికోట రాజధానిగా నాంధ్రదేశము నేలుచుండెను. ఈతఁడు గంగాయాత్రకుఁ బోయినపుడు అహిచ్ఛత్రపురమున శ్రీవల్లభుని సేవించి బ్రాహ్మణుల కనేకదానములు గావించెను. ఒకనాఁడు గంగలో స్నానము చేయుచుండఁగా నాతని పాదుకలు మాయావు లెవరో అపహరించిరి. అవి శివుని మెప్పించి యాతఁడు పడసిన యోగపాదుకలు. అవి తొడుగుకొనినచో, తాను తలఁచినచోటికి క్షణమాత్రముననే అనాయాసముగాఁ దీసికొనిపోవును. అప్పు డచ్చటి బ్రాహ్మణుల మంత్రప్రభావమున నాపాదుకల నతఁడు తిరిగి సంపాదించి యచ్చటి బ్రాహ్మణులను ఆంధ్రదేశమునకు దయచేయుఁడనియు వారికి గృహారామవృత్తులను ఇచ్చెద ననియుఁ జెప్పెను. వారపుడు రాలేదు గాని తర్వాత గంగాతీరమున క్షామము వచ్చినపుడు ధరణికోటకు వచ్చినట్లును ముక్కంటీశ్వరుఁడు వారికి గృహారామ క్షేత్రాదులిచ్చి పోషించినట్లును గలదు. ఈ విషయము నితర గ్రంథములును శాసనములును ధ్రువపఱుచుచున్నవి. త్రిలోచనపల్లవుని ముక్కంటికాడువెట్టియని గూడ కొన్ని శాసనములు పేర్కొనుచున్నవి. ఈతఁడు కరికాల చోళునికి సమకాలికుఁడైనట్లును, గంగానదీ ప్రాంతమునుండి వచ్చిన యనేక బ్రాహ్మణకుటుంబముల కగ్రహారముల నిచ్చి కృష్ణాతీరమున నిలిపినట్లును, కళింగత్తుప్పరణి యను తమిళ గ్రంథము వలనను, పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర మొదలగు వాని వలనను దెలియవచ్చుచున్నది. ఈ ముక్కంటీశ్వరుడు గంగాతీరము నుండి వచ్చిన యేడునూఱు బ్రాహ్మణకుటుంబముల కగ్రహారము లిచ్చుటయేగాక, గుంటూరు జిల్లాలోని, ఇనగల్లు, ఉప్పుటూరు, పంక్తిరాత్రిపాడు మొదలగు గ్రామములనుప ష్టర్షులపేర మఱియేడగ్ర

హారములుగా నిచ్చునట్లును అవి నడుమ విచ్ఛిన్నములుకాఁగా కోటవంశీయుఁడగు కేతరాజు ముక్కంటీశ్వరుఁడిచ్చిన యగ్రహారములను మరల స్థిరపఱచినట్లును పండ్రెండవ శతాబ్దమున నాతఁడు స్థాపించిన శాసనమొకటి (S.I.I. Vol. VI-228) చెప్పుచున్నది. ఈతఁడు కరికాలచోళునితో సమకాలికుఁడని తెలియుచున్నది. ఈతని కాలము క్రీ. శ. ఆఱవ శతాబ్దిప్రాంతమగును.

ఇందలి యైతిహ్యమును బట్టి ఆంధ్ర విష్ణువు గంగాతీరమందలి యహిచ్ఛత్రపురమునుండి వచ్చినట్లగపడుచుండుటచే నీయహిచ్ఛత్రపురము కాకుళపురమువలెనే ఆంధ్రుల యధికారములోనే మొదట నుండెనని తలంపఁదగియున్నది. కాలము నడువఁగా నడువఁగా పురములు దిబ్బలు, దిబ్బలు పురములనగుట క్రొత్తగాదు. మన కాకుళపురమును మఱొకమాఱు కృష్ణవేణ్ణమ్మ కడుపునఁ బెట్టుకొన్నది. సుమతి కట్టించిన దేవాలయమేకాక పుష్కరిణికూడ రూపు మాసిపోయినది. కాని యీక్షేత్రమాహాత్మ్య మెట్టిదో కాని మరొక్కమాఱు నిజమహిమతో నది వెలసినది.

కళింగదేశమున కటకపురరాజును గజపతులలో నొకఁడును అగు అనంగభీముఁడు అరణ్యమధ్యమున నొకబాలుని గాంచెను. ఆతఁడు చూచునప్పటికి అనంతుఁడు (ఆదిశేషువు) పడగ విప్పి తన పడగక్రింద నాబాలుని గాపాడుచుండెను. రాజు రాఁగానే ఆతఁడు కాపాడునను భావముతోఁ గాఁబోలు ఆ పాము అదృశ్యమయ్యెను. అనంతునిచేఁ బాలింపఁబడిన వాఁడు గాన ఆబాలుని కంసతపాలుఁడను పేరుపెట్టి రా జాశిశువు శుభలక్షణ లక్షితుఁ డగుటచేత గొప్పవాఁడగు నని యెంచెను. ఆతని పాదమున నొక తాటియాకు కట్టియుండఁగా రాజు అందు వ్రాసియున్నదానిని పఠించెను. అందు బాలుని తలిదండ్రుల నామములు, కులగోత్రములు, కృష్ణా తీరమునందలి కాకుళ క్షేత్ర ప్రాంత మాత్మని నివాసమగుట, విడిచిపోవుటకుఁ గారణ

ణము మున్నగు విషయములు గలవు. అవి యాతఁడు గ్రహించి యా శిశువును దీసికొనిపోయి తన పుత్త్రునితోఁ బాటు విద్యాబుద్ధులు చెప్పించి పెంచుచుండెను. ఆబాలుని కుపనయనకాలము వచ్చినపుడు ఆపత్త్రముమీఁద వ్రాయఁబడిన గోత్రప్రవరలతో నుపనయనాది సంస్కారములు జరిగించి యావృత్తాంత మాబాలునికిఁ దెలిపి యాపత్త్ర మాతని కిచ్చెను. అనంగభీముఁడు వృద్ధుఁ డయినపుడు తన కుమారుఁడగు నృసింహునకు రాజ్య మిచ్చి అనంతపాలుని దండపాలుని గావించెను.

నృసింహుని రాజ్యమున ననంతపాలుఁడు మంత్రిగాఁ గూడ నుండెను. అప్పుడు కంచిపైకి దాడివెడలి యచటి రాజులను జయించి విజయాంక శాసనమొకటి యచ్చట స్థాపింపవలయునను సంకల్పము నృసింహరాజునకుఁ గలిగినది. ఆతఁడు దండపాలుని పిలిపించి తన సంకల్పమును జెప్పి 'నీకును నాకును భేదములేదు. నీవు దండువెడలి కంచిలో విజయశాసనము స్థాపించిర మ్మన నాతఁడు రాజాజ్ఞ శిరసావహించి తగినసేనతోఁ దండువెడలెను. మార్గమధ్యమునఁగల తీర్థములను సేవించుచు దానధర్మములు చేయుచు నతఁడు దండయాత్ర చేయుచుండెను. ఆదండయాత్రలో కృష్ణాతీరమునందున్న శ్రీకాకుళ క్షేత్రమునకువచ్చి యచట దండువిడిసి పటశిబిరమున సుఖముగాఁ గూర్చుండి కృష్ణాతీరమునందలి శ్రీకాకుళ క్షేత్రపరిస్థితులను చూడఁగా నవి తనశైశవమునఁ దనకాలికిఁ గట్టఁబడియున్న పత్రములో వ్రాసియున్న విషయములకు సరిపడియున్నట్లు తోఁచి నాతల్లిదండ్రులు సజీవులయి యున్న యెడల వారిని దర్శింపఁగల నని యాలోచించి దాని కుపాయముగా తత్ప్రాంత గ్రామములందలి బ్రాహ్మణుల నందఱను బిలిపించి దానసమయమున వారివారి కులగోత్ర నామములను జెప్పించుచుండఁగాఁ దన పత్త్రములలోనున్న కులగోత్రములును నామమును గల బ్రాహ్మణునిగనిపట్టి యాతఁడు తన తండ్రియనియెంచి యెల్లరకు సెల విచ్చి పంపి యా బ్రాహ్మణునకుఁ దనయొద్దనున్న పత్త్రమును

జూపెను. ఆబ్రాహ్మణుఁ డాశ్చర్య సంతోషములతో దండనాథా! ఈపత్రము నీ కెట్లుఁలభించినది? ఈపత్రమును కాలికిఁగట్టి నాపుత్రుని యరణ్యమున విడిచిపెట్టి పోతిని. అతఁ డెక్కడ నున్నాఁడో సెల విమ్మని కోరఁగా అనంతపాలుఁ డాతఁడు తనతండ్రియని నిశ్చయించు కొని తన వృత్తాంతమును దెల్పెను. ఆబ్రాహ్మణుఁడు సంతసించి శీఘ్రముగఁబోయి తనభార్యను బిలుచుకొని వచ్చెను. అనంతపాలుఁ డును అతని తల్లిదండ్రులును బ్రహ్మానంద మొందిరి.

ఆతఁడు పెద్దలవలన శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యమును విని విస్మయానంద పరిపూర్ణహృదయుఁడై తన జనకులను దర్శించిన స్థలమగుట చేతఁగూడ నధికాభిమానమును పొంది తత్ప్రదేశంబున దివ్యప్రతిష్ఠ చేయుటకై గృహక్షేత్రాదు లిచ్చి కొన్ని బ్రాహ్మణ కుటుంబములను నిలిపి యచటఁ బ్రతిష్ఠింప భగవద్విగ్రహమునకై వెదకుచుండఁగా, బ్రహ్మకుండి తటినీతటమందు శంకరదివ్యధామ మన నొప్పుపురమున విప్రుఁడగువామనశర్మ యింటిలో కాకరపాదు క్రింద ఆంధ్రవల్లభుని విగ్రహమున్నదని తెలిసికొని అది తెప్పించి మహావైభవముతోఁ బునః ప్రతిష్ఠ గావించి పురప్రాకారాల యాదులు కట్టించెను.

ఈవిగ్రహము లభించిన విషయము తెలుపుటకై పురాణ రీతిని శ్రీ వల్లభుఁడే వామనరూపముతో వచ్చి యితర బ్రాహ్మ ణులతోపాటు పదివృత్తులు దానమునఁ బ్రతిగ్రహించిపోయి మరల రాక మాయమయినట్లును రాజు బ్రాహ్మణ భోజనసమయమున నా వామనరూపుని గానక ఆతఁడు వచ్చువఱకు భుజింప నని నిరశన వ్రతముతో నుండి కొంచెము నిద్రింపఁగా స్వప్నమున శ్రీ వల్లభుఁడు ప్రత్యక్షమయి తాను వటురూపమునవచ్చి దానమును గ్రహించుట తెలిపి వామనశర్మ యింటిలో కాకరపాదుక్రింద నుంటి నని చెప్పినట్లును గ్రంథమునఁ గూర్పఁబడినది.

దండపాలుఁడు మహావైభవముతో సర్వోత్సవములు జరు గుటకుఁ దగిన యేర్పాట్లు గావించి రాజ కార్యనిర్వాహణమునకై

కంచికిఁబోయి యచటనున్న రాజులను నిర్జించి విజయాంకశాసనము స్థాపించి మరలఁ గటకపురమునకుఁ బోయెను. పండ్రెండవ శతాబ్దిని కళింగదేశపురాజగు నృసింహుఁడు దక్షిణదేశముపై దండుబంపుట చరిత్రప్రసిద్ధమును నయియున్నది. వింధ్యప్రాంతమునున్న కళింగరాజులలో అనంగభీముఁడు క్రీ. శ. 1145 ప్రాంతము వఱకు పాలించెను. ఆతని కుమారుఁడు 1145 మొ. 1164 వఱకు పాలించెనని శాసనములు తెలుపుచున్నవి. కంచిలోనున్న శాసనములలో నరసింహునిపేర ఆతని దండనాథుఁడు స్థాపించిన విజయశాసనమును ఉండనోపును.

linga

ఇట్టి చరిత్రాంశములను మనపూర్వులు భవిష్యద్రాజేతిహాసములను పేరఁ బురాణములలోఁ గొన్ని మార్పులతోఁ జేర్చుట సంప్రదాయసిద్ధము. అవి తర్వాతఁ జేర్పఁబడినవియని యవే చాటుచున్నవి. అట్లే మనవారు పయి చరిత్రాంశములను పరంపరగా వినికిడిలో నున్నవానిని కొన్ని మాహాత్మ్యములతోఁ గలిపి కొన్ని యధ్యాయములు రచించి అది బ్రహ్మాండ పురాణాంతర్గతమని చెప్పి దానికిఁ బ్రామాణ్యము గల్పించియుందురు. ఆభాగముగూడ శిథిలమయి పోవఁ గొన్ని భేదములతో మరికొందఱు కొన్ని భాగములు రచించియుందురు.

ఈ ప్రబంధము శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యమును దెలుపుచు ఆంధ్రవల్లభదేవుని మాహాత్మ్యముతోపాటు ఆంధ్రజాతి ప్రాచీనచరిత్రకు సంబంధించిన గాథలను గొన్నిటిని వర్ణించునదగుటచే నీవాఙ్మయమున నొక విశేషలక్షణము గలదగుచున్నది. ప్రాచీనాంధ్రుల చరిత్రనుగూర్చి తెలిసికొనుటకుఁ దగినసాధనము లాంధ్రభాషలో లేవనియే చెప్పవచ్చును. ప్రాచీనాంధ్రరాజుల శాసనములన్నియు ప్రాకృతములోనే రచింపఁబడియున్నవి. తరువాతికాలపు శాసనములుగాని గ్రంథములుగాని తొలిరాజులను గూర్చిన గాథలను దెలుపునవికావు. ఆంధ్రుల కులదైవతం బనఁదగిన శ్రీకాకుళాంధ్రనాథుని ప్రశంసయు నాంధ్రవాఙ్మయమున

రెండుమూడు సందర్భములందుమాత్రము కనఁబడుచున్నది. చిర కాలము విస్మృత ప్రాయమైయున్న యాంధ్రనాథుని ప్రశస్తి యిటీవల మరల విజయనగరాంధ్రసామ్రాజ్యాధీశ్వరునిచే గీర్తింపఁ బడుటచే నాంధ్రలోకమున బునరుజ్జీవింపఁ జేయఁబడినదైనది. కృష్ణదేవరాయలకుఁ బూర్వముగూడ నీక్షేత్రమునుగూర్చి యించుక ప్రశంసలేకపోలేదు. అచ్చటి శాసనములలో "కాకతిగణపతి దేవు మహారాజు ప్రధాని గజసాహిణి శ్రీకాకొలని వల్లభునికి" దానము చేసినట్లొక శాసనము కలదు. అనంతామాత్యుడు భోజ రాజీయమున తనతండ్రి ముమ్మడి తిక్కవిభుఁడు,

" నెమ్మి ప్రత్యహ. పరమపదంబనంగ,
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన
యంధ్రవల్లభ హరిసేవ నలరుచుండు"

నని చెప్పియున్నాఁడు. ఈతఁడాయూరివాఁడే కావచ్చును. వల్లభ రాయని క్రీడాభిరామమున " శ్రీకాకుళాంధ్రదేవుని తిరునాళ్లను గూర్చిన ప్రశంసకలదు. అందీవల్లభాభ్యుదయమున ఆంధ్రవిష్ణువు కాకరపాదులలో దాఁగియుండుటనుగూర్చి తెలుపఁబడిన పురాణ గాథయొకటి మాత్రమే యిట్లు సూచింపఁబడినది.

" కారవేల్లమతల్లి కాకల్వవల్లి
కడుపునిండారగించిన కొడుకుఁ గుఱ్ఱ
జారచోరమహాధూర్త చక్రవర్తి
దేవవేశ్యా భుజంగుండు తెలుఁగుభర్త.

దీనికి సంబంధించినదే మఱియొక విషయమిందుఁ జెప్పఁబడి నదిగాని యది మన వల్లభాభ్యుదయములో లేదు.

"పసిఁడికోర వేఁడి పాలారగించినఁ
బుల్లసిలిన యధరపల్లవమున
విప్రపత్న్య చనవు వెలయించుచున్నాఁడు
విశ్వమునకుఁ గాకుళేశ్వరుండు "

"ఈరసనొత్తు వేదములు ప్రీవహియించుఁ బురాణ జాలముల్
సౌరభహీనమౌ నుపనిషత్తులు వెంబడు నాగమావళుల్
గారవ మల్లసిల్ల సిరి కాకుళ నాథుఁడు నాగదేవ భ
ట్టారకు నింటఁ బుట్టి ప్రకటంబగు వేడుకనారగింపఁగన్ "

వల్లభాభ్యుదయమున నీదేవుఁడు - వామదేవశర్మ యింట కాకరపాదులో నివసించినట్లున్నది.

ఇటీవల కాసులపాటి పురుషోత్తమకవి " చిత్రచిత్ర ప్రభావ కారుణ్యభావ, హతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ" అను మకుటముతో 'ఆంధ్రనాయకశతము నొకదానినిరచించినాఁడు. ఈతని రచనలోఁ బ్రత్యేకముగానాంధ్రనాయకునిగూర్చినగాథలలోనొక్కదాని ప్రశంసయే గానవచ్చుచున్నది. తక్కినవన్నియు సామాన్యముగా విష్ణుపరమైన విషయములే. ఆంధ్రవిష్ణువు తన యర్చకునిమాట దబ్బరగాకుండ దాను శిరమున వెంట్రుకలు ధరించినగాథను "వైఖానసోక్తికి వంచనరాకుండ నెఱులుచూపినమాటనిజమయేని" అనినిందాగర్భముగ నాదేవుని స్తుతించుటమూలమున సూచించియున్నాఁడు. ఇది స్థలమాహాత్మ్యకథలలోను బ్రహ్మాండ పురాణాంతర్గతంబని చెప్పఁబడుచున్న సంస్కృత శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యమునను గానవచ్చుచున్నది. కాని కోదండరామకవికృత ప్రబంధమున నిది లేదు. సుమతియను నాంధ్ర చక్రవర్తి రాణులిద్దఱు నిత్యముపంపు పూలమాలికలను వేశ్యాలోలుఁడగు వైఖానసుఁడు తన వేశ్యకిచ్చి మఱునాఁడుదానిందీసి రాణులకంపుచుండనొకనాఁడందు గంధతైలసంవాసితంబగు కేశముండుటను జూచి రాణులు కోపించి వైఖానసుని బిలిపించి యడుగఁగా నాతఁడు దేవునకుఁ గేశములుగలవనియు వారియందనుగ్రహముచే నా కేశమును బ్రసాదముగాఁ బంపెననియుఁ జెప్పుటయు, నారాజుమఱునాడు కేశములనుబరీక్షింపవచ్చెదనని చెప్పఁగా, నారాత్రి వైఖానసుఁడు దేవుని బ్రార్థింప మఱునాడు దేవుఁడుశిరసున కేశములు ధరించియుండెననియు, దానిని వారు స్పృశించిచూచి వైఖానసుని గౌరవించినట్లును, మఱికొంతకాలమున కా దేవుఁడా

క్లేశముల నుపసంహరించికొనినట్లునుగూడ సంస్కృతమాహాత్మ్య గ్రంథమునందలిగాథ తెలుపుచున్నది.

శ్రీకాకుళ శ్రీహరిశతకమను మఱియొక గ్రంథమునఁగూడ నీ గాథ యిట్లు తడవఁ బడినది.

" ఇతఁడా కాకుళ వల్లభుండనెడి వాఁడీతంౘ్రడియే నా సమా
శ్రితదోషాపనయార్థమై సిగధరించే తంౘ్రడి యీయప్పుడా
పతితుల్ పావనులాయఘుంబు సుకృతప్రాయంబుగాఁ జేయు స
ద్వ్రితుఁ డాహా యని నిన్నుఁ బల్కు-దురు గాఁగా కాకుళశ్రీహరీ"

(శ్రీహరిశతకము)

ఇట్లచ్చటచ్చట కాకుళేశ్వరుని గూర్చిన ప్రశంస యించుక గానవచ్చినను ఆస్థల మాహాత్మ్యమునుగూర్చిన గాథలను ఆదేవుని పూర్వ చరిత్రమును ప్రబంధరూపమున వెలయించిన వాఁడీ కోదండ రామకవి యొక్కఁడే.

కాకుళ పద నిర్వచనము

కాకుళక్షేత్రము కాకుళేశ్వరుఁడు అను పదములలోని కాకుళపదమునకు 'కాకుల' అను రూపాంతరము గ్రహించి క=బ్రహ్మచేత,ఆకుల=వ్యాప్తమైనది. బ్రహ్మయీక్షేత్ర రామణీయ కమునుజూచి తన్వీభీతక బహురూపములనంది యచ్చట నిలిచి నట్లును కావుననే దాని కీ పేరుగలిగినట్లును కథ తెలుపుచున్నది.

గంగాతీరమునఁ దపముచేయు బ్రహ్మకు విష్ణువు ప్రత్యక్షమయి 'ఇచ్చటను జాలఁ దపంబొనరించితింకఁ గృష్ణాతటినీ తటంబునఁ బ్రశాంత సమాహిత బుద్ధిచేఁ దపం, బాతతిఁ జేయు శీఘ్రముగ నయ్యెడ కే నరుదెంతు-బుత్త్రికా !". అని యిచ్చిన యానతిప్రకారము బ్రహ్మ కృష్ణాతీరమునకుఁ నేఁగఁగ నడుమ నొక్కచో,

" అనుపమ కాననాంతరమహానది రమ్యతరంగడోలికా
కనదురురాజహంసము ఖగప్రకరాళులతీరభూరుహం,
బనువుగఁగాంచి చోద్యముగ నబ్జజుఁ డాస్మృతు తన్వి తీరకన్."

మత్త. పెక్కురూపములై కనుంగొని ప్రేమనివ్వాలుఁడైనయా,
పక్కిడాల్ దొరబిడ్డఁడు ...
... ... ...
... మేదిని నొక్కఁడైయట నిల్చినన్ "

ఉ. అంతట నొక్కనాఁడు చతురాస్యునిపాలికి సర్వదేవతా
సంతతు లేఁగుదెంచి బహుసంస్తుతు లొప్ప నమస్కరించి వి
భ్రాంతమనస్కులయ్యు నతిరమ్యత నచ్చట రాజనద్వయం
బంతట నిల్చియున్ భవదుపాస్తికి, నాశ్రయ మాస్థలం బిలన్.

ఉ. అతులమైనయట్టి భవదాకృతి కామిత భద్రదాయి శ్రీ
కాకులనామధేయ మనఘంబుగఁ జేయు మటంచు వేలుపుల్
జోకలుగూడి వేఁడిన వచో విభవంబులను గ్రహించె నా
లోకపితామహుం డమర లోకవిలోకన మాచరింపుచున్.

" లోకంబునం బ్రఖ్యాతం బగు పుణ్యక్షేత్రంబుగా ననుగ్రహించి నైజా
కుల నిదానంబునఁ గాకులాభిధానం బొసరించె ".

మఱియు కాకుళక్షేత్రమున విష్ణువు బ్రహ్మకుఁ బ్రత్యక్షమైన తఱి బ్రహ్మ యతని కిట్లనియె.

ఉ. ఇప్పుడు నిన్నుఁగూర్చి యిట యే నొకఁడం దప మాచరింప నీ
చొప్పుగ సర్వదేవతలు నూరలఁ రాఁ జని నిల్చి నట్టి యీ
దెప్పరపున్ నివాసము విధిప్రకరాకులమయ్యెఁ గావునన్
దప్పక కాకులాహ్వయ మొనర్చితి దేవ యనుగ్రహింపవే ".

అనియు నుండుటంజేసి బ్రహ్మగూడఁదనివినొందక బహురూపముల ధరించి-వీక్షించిన ప్రదేశము అను భావము గనఁబడుచున్నది.

ఈపేరు కథానుసారముగఁ గల్పింపఁబడినదిగాని మొట్టమొదటిపేరు గాదనియు దీనికి మూలరూపము వేఱుగా నుండుననియుఁ దోఁచుచున్నది. అది పరిశీలింపఁ దగును.

ఈ క్షేత్రమందును ఇతరస్థలమందును గల శాసనములలో 'కాకొలని శ్రీవల్లభుఁడు' అనియున్నది. పండ్రెండు పదమూఁడు. శతాబ్దులలోని శాసనములలో కాకొలని అనియు

పదియేనవ శతాబ్దశాసనములలో కాకుళము అనియుఁ గనఁబడుచున్నవి. క్రీడాభిరామమున "కాకొల్ని" అని యున్నది. ఇందు కారు, కొలను అను రెండు పదములున్నవి. ఇందలి 'కా' అనునది కారుశబ్దముయొక్క యవశిష్ట భాగము కావచ్చును. కార్కొలను అను దానిలో రేఫ ముచ్చారణవశమున లోపింపఁగా సిద్ధించినది కాకొలను అను రూపము. కారు అనఁగా అడవి. అడవిలోనున్న కొలను అని భావము. ఇది మహారణ్య మధ్యమున నున్నదనియు ఇందుఁ పెద్ద సరసు (అదే చక్ర తీర్థము) గలదనియు ఈ కథలోనే యున్నది. కారుకొలను, కార్కొలను, కాకొలను అని రూపావతారము. కొలను అను పదమునకు కొళ, కొళమ్, కుళ, కుళమ్ కుల, కులమ్ అను రూపములు కర్నాట తమిళ మహారాష్ట్రభాషలలోఁ గలవు. తత్తద్దేశీయులు వాడునపుడును కాకొళ, కాకుళ అను రూపము లుదయించి యుండును. అది సంస్కృతపదముతోఁ గలుపఁగా కాకుళాధీశ్వర, కాకుళేశ్వర, కాకుళక్షేత్రమొదలగునవి సిద్ధించియుండును. కావుననే పదునేనవ శతాబ్దమునందలి కృష్ణదేవ రాయని శాసనమునను భోజరాజీయమునను కాకుళ అనురూపము గనఁబడుచున్నది. ఇదియంతయు నాలోడనముచేయఁగా శాసనములనుబట్టి పండ్రెండవ శాతాబ్ది ప్రాంతమునను, క్రీడాభిరామమును బట్టి పదునాల్గవ శతాబ్దము ప్రాంతమునను 'కాకొలను' అను రూపమును పదునేనవ శతాబ్ది ప్రాంతమునకు 'కాకుళ' కాకొళ, కాకుల అనురూపములును వాడుకలోనికి వచ్చినట్లును కనఁబడుచున్నది. పండ్రెండవ శతాబ్దికిఁబూర్వమం దుండుశాసనములలో లభ్యమయిన వానిలో దీనిప్రయోగము గనఁబడలేదు.

**దీని ప్రతులు**

వల్లభాభ్యుదయము ప్రతి యొకటి మదాసు దొరతనము వారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము - R. No. 496.

సంఖ్యతోఁగలదు. ఇది భట్లపెనుమర్తి తాండవకృష్ణయ్య గారి ప్రతి ననుసరించి, వ్రాయఁబడినదని చివరఁగలదు. దీనికి 'క' ప్రతియని గుర్తించితిమి. వేఱొక ప్రతి యిటీవల శ్రీకాకుళప్రాంతమునుండి సంపాదింపబడినది. దానికి 'చ' ప్రతియని సంకేతము. ఇందు 'క' ప్రతిలో లేని కొంతభాగము లభించినది. తృతీయాశ్వాసమున 49 మొదలు 95 పద్యము వఱకుగల భాగము 'చ' ప్రతిలోనుండి గ్రహింపఁబడినది. ఇంక ననేకపాఠముల విషయమున గూడ నిదియెంతయు నుపకరించినది. దీనిని సంస్కృతగ్రంథములోఁ గూడ సంపాదించియిచ్చిన మైలవరం సూరి-లు తెలుగుపండితులగు శ్రీ విద్వాన్, శృంగారం అయ్యమాచార్యులవారి కెంతయు కృతజ్ఞులము.

కోరాడ రామకృష్ణయ్య.
శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రి.

---

# వల్లభాభ్యుదయము

---

## ప్రథమాశ్వాసము

---




మత్కులనాథు మాధవు విరిం
చిప్రార్థనాధీను సు
త్రా[1]మాశ్మోపమమేచకాంగు నతబృం[2]
దారుఁ సుపర్ణాశ్వు ని
త్యామర్త్యో[3]పచితాబ్జపద్ద్వయు సరో
జాక్షుఁ జగద్వల్లభ
స్వామిన్ సద్గుణు నాశ్రయించెద నభీ[4]
ష్టప్రాప్తికి న్నిష్ఠతోన్. 1

ఉ. శ్రీశరణుండు సూరిజన - సేవితపాదసరోజుఁడున్ సుప
ర్వేశ మణిప్రభానిభశ - రీరుఁ డనంతశుభాంతరంగుఁడున్
కేశవదేవుఁడున్ గరుడ - కేతనుఁ డూర్జితశక్తుఁడున్ హృషీ
కేశుఁడు వేంకటాచల ని - కేతనుఁ డెప్పుడు మమ్ముఁ బ్రోచుతన్. 2

ఉ. జ్ఞానమయస్వరూపునిఁ దు - షారకరోపమదేహునిన్ సుఖా
సీనుని వేదవేద్యుఁ దుల - సీదళదామవిభూషు మంజువా[5]
గ్మానసకాయికంబులఁ ద్రి - కాలముఁ బూజ లొనర్చి నెమ్మదిన్
ధ్యానముసేసి కొల్చెద హ - యాననమూర్తి నభీష్టసిద్ధికిన్. 3

సీ. శ్రీధరుఁగొల్చి లక్ష్మీదేవిఁ గొనియాడి
మొదల విష్వక్సేను - మదిఁ దలంచి
శఠకోపసంయమి - సరవితో భజియించి
నాథమానులఁ గూర్చి - నతియొనర్చి

---

1. క. చ. "మాశ్వోపమ" 2. క. మాభా. చ. మందా. 3. క. చ. "పచితాపదద్వయు"
4. చ. "భీష్టావాప్తి" 5. క. చ. "వాఙ్మానస"

పుండరీకాక్షులఁ | బొగడి నెమ్మది రామ
మిశ్రుల నవలీల | నాశ్రయించి
యామునాహ్వయునిఁ [1]బ | రాంకుశు సేవించి
రామానుజార్యులఁ | బ్రేమ నుడివి
సర్వగురువుల నుతియించి | సౌమ్య మలరఁ
బరమదేశికవరుల సపర్యచేసి
యస్మదాచార్య వర్యుల | నాత్మ నిలిపి
నిత్యసూరుల సేవించి | నేర్పుతోడ.

ఉ. ఆదిము వామలూరుతన | యాగ్రణి నారదునిం బరాశరున్
వేదమయున్ జగచ్ఛయ ప | విత్రుని సాత్యవతేయు భీష్ముఁ బ్ర
హ్లాదుని నంబరీషుని శు | కార్జున శౌనక పుండరీకులన్
మోదవిశిష్టు దాల్భ్యముని | ముఖ్య వసిష్ఠుఁ దలంచి మ్రొక్కెదన్. 5

శా. కాళీదాసుని మాఘు భారవుల వే | డ్కం దండి సౌమిల్లునిన్
వాలాయంబు మయూరుఁ జోరుఁ గవివా | గ్వ్యాపారమేపార వా
హ్యాళిం బ్రాకృతసత్కవీంద్రుల గుణా | హ్లాద ప్రశంసన్ వచ
శ్శీలం బొప్ప నుతించి సూరిజనులన్ | సేవించి భావించెదన్. 6

చ. ధనికుల గేహవాటికలఁ | దస్కరుఁ డర్థ [2]మపహ్నవించు చా
డ్పున బుధ పుంగవ ప్రకృత | పుస్తక శబ్ద విశేషసంగతుల్
మనమున నెంతయుం బడసి | మాలిన యాకుకవి [3]ప్రణీతనూ
తనకృతి తత్సభా ప్రకటి | తంబయినన్ భువి నాదరింతురే? 7

చ. అనుచు నభీష్ట దేవతల | నంజలిఁగూర్చి ముదం బెలర్ప వం
దన మొనరించి సద్గురు క | దంబములన్ ఋషివర్యులన్ బురా
తనకవిసార్వభౌముల బు | ధప్రకరంబుల సన్నుతించి యా
ధునికకవీంద్రులం బొగడి | దుష్కవిరేఖఁ దిరస్కరించియున్. 8

1. క. పరాంకుశసంసేవు చ. సంసేవ్య 2. అపహ్నహించు. చూ. ఇందే ఆ. 3. అపహ్నుతద్రవిణము, అపహ్నవించు. 3. క. ప్రణీత దండనకృ సచ్ఛభా ప్రణదితం. చ. "దండనకృతి సత్సభాప్రవిదితం"

ఉ. కౌముదియైననుం జదువ § కక్కఱచియించె నటంచుఁ జిత్తముల్
కోమల మేల(?) శబ్దచయ § గుంభనలక్షణ లక్ష్యవైఖరిన్
బ్రేమ దలిర్పఁ జేసెద గ § రిష్ఠబుధాగ్రణులార వల్లభ
స్వామి వరప్రసాద విభ § వం బిది సత్కృతిగాఁ దలంపుఁడీ! 9

వ. అది యెట్లనిన మున్నొక్కపుణ్యదివసంబున నిశాసమయంబునం దేకాంత నివాసంబున మంచకోపరి సుఖసుప్తుండనై యున్నయెడ మదీయ స్వప్నంబున నొక్క దివ్య పురుషుండు సాక్షాత్కృత శరీరుండై మత్పరిసరంబునం దగిలి ప్రత్యక్ష తాళీదళసంపుటం బొసంగి యొక్క కృతి చమత్కృతిగా రచియింపు మనిన నగ్రాహ్యంబుగా నేమఱి యూరకున్నంతన్ గొన్నిదినంబులు గడచిన పిమ్మట నొక్కనాఁ డపరరాత్రంబునం బునస్స్వప్నవేళంబున సహర్షముఖంబునం గృష్ణా ప్రవా హావగాహసంతరంబునన్ బరిశుద్ధాంబరధరుండనై పూర్వాభిముఖంబుగా దర్భాస్తరణసమాసీనుండనై భగవదాజ్ఞాకైంకర్యధుర్యుండనై యున్న మత్సమీపంబున విప్రరూపంబునఁ బ్రసన్నుడై నన్నుఁ గనుంగొని యిట్లనియె. 10

శా. శ్రీపత్యంఘ్రిసరోజసంశ్రిత జనా § శీర్వాద లబ్ధ ప్రతి
ష్ఠాపర్యాప్తిత నాంధ్ర కావ్యరచనా § సామర్థ్య దైవజ్ఞ వ
ర్యాపస్తంబసుసూత్ర పాత్రపరిచ § ర్యా భట్లపెన్మర్తి స
ద్గోపామాత్యతనూజ సాధుహృదయా § కోదండరామాహ్వయా! 11

క. అని పిలిచి నిజకరంబునఁ
దనదుపురాతనపు సంస్కృతశ్రీ కోశం
బును నొసఁగిన నిది యెయ్యది
యనవుడు నతఁ డెఱుఁగఁ జెప్పె § నభిమత మెల్లన్. 12

వ. శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యం బిది వ్యత్యస్తంబై యున్నయది. యథాక్రమంబుగా నొనరించి సవిస్తరంబు గావింపు మని యడిగినఁ దదనంతరంబ నీ వెవ్వ రని యే నడిగినఁ దాను శ్రీరంగపట్టణ రంగనాథుండ నని తన యన్వయాభిధానంబులఁ దేటపడ నెఱింగించిన భోజనా నంతరంబున సకల సంభాషణంబుల కనుకూలంబు రమ్మని యాద్విజు నస్మద్గృహంబునకుఁ

దోడ్కొని వచ్చియా విప్రునితో నిష్టాలాప సంభాషణంబున నుండి యంత సూపాదన శాకపాక యత్న పరుండనై యేను మాధ్యందినస్నానం బొనరించి పూతాంశుక పరివృతుండ నగుచు దిగ్గున మేల్కాంచి సమాహిత స్వాంతుండనై సంభావించి గురుబుధ కవి వర్యులకుం బ్రణమిల్లి తదను మతి వడసి నా నేర్చు విధంబున రచియింప నుద్యుక్తుండనై. 13

క. తొలిజన్మసంప్రదాయము
తెలమి వితర్కించి చూడ నెయ్యెయ్యవియో
తెలియవు, ఇఁకముందటఁ రాఁ
గల తత్తత్సంప్రదాయ కథ యెయ్యదియో. 14

వ. అని వితర్కించి చూడఁ బ్రకృతి నస్మదీయతనుబంధ సంబంధాన్వయ పరంపరాభివర్ణనసేయుట వృథానులాపం బని మనంబున నిశ్చయించి యంచితంబగు భగవద్గుణానుభవంబు సేయ నిఖిలకల్మషాపహారంబును నతిపావనంబును నని తలంచి తన్మాహాత్మ్యం బభివర్ణించెద నివ్విధంబున. 15

క. శ్రీమత్కాకుళ నివసన
కామ, రమాధవ నితాంత కల్యాణ గుణో
ద్దామ హరి నీలవిగ్రహ
హేమాంబరవృత విరించి హితనుతచరితా! 16

వ. అని మఱియును. 17

శా. జ్ఞానానందమయుణ్ జగద్గురు, మనోజ్ఞ ప్రౌఢినిత్యాను సం
ధాన శ్రీకర మాంధ్ర నాయక చరిత్రం బద్భుతం బార్య సం
తాన స్తవ్య మటంచు నెమ్మది సమాధానంబుగాఁ దత్కథా
ధీనస్వాంతుఁడనై, రమాధవునిఁ బ్రార్థింతుణ్ విశేషంబుగాన్. 18

మ. కలశాంభోధిసుతాకళత్రుని జగత్కల్యాణ చారిత్రునిణ్
బలభిన్నీలసద్మృదుగాత్రుని సువర్వస్తోత్రి సత్పాత్రునిణ్
నలినప్రస్ఫుట నేత్రునిణ్ దనుజనీనాశైత్రునిణ్ దీనవ
త్సలసన్మిత్రుని మౌక్తికాతతపరిష్కారోల్లసచ్ఛత్రునిన్. 19

సీ. ఇంద్రనీలోపమ సాంద్ర సంహననుఁ బీ
తాంబర ధారు నా గారిగమను
మండిత కోటీర మాణిక్య కుండలుఁ
గౌస్తుభరత్న ప్ర కాశవదను
శార్ఙ్గ నందక శంఖ చక్ర సమన్విత
బాహుచతుష్టయ భాసమానుఁ
గంకణ కేయూర కింకిణి కాంచికా
మంజీర నూపుర రంజితాత్ము
గరుడకేతను నుర గేంద్ర శరధి శయను
నుతగుణోల్లాసు లక్ష్మీమ నోనివాసు
మహితపదపద్ముఁ గుంద స మానరదనుఁ
గోటి మన్మథలావణ్యు గుణశరణ్యు. 20

షష్ఠ్యంతములు.

క. ఏవం విధసుందరునకు
భావజజనకునకుఁ బరమ పదవాసునకున్
దేవారిసైన్యజేతకుఁ
గేవలదివిజప్రసన్న కృతగాత్రునకున్. 21

క. శ్రీవనితా వల్లభునకు
సేవక జేగీయ మాన చిద్రూపునకున్
బావనమూర్తికి సంయమి
భావనివాసునకు రుచిర పద్మాక్షునకున్. 22

క. ఇందీవరాభ మేచక
సుందరగాత్రునకు నవ్య శుభచరితునకున్
బృందారకాభినుతునకు
ఛందోవీథీప్రచార చణచరణునకున్. 23

క. విష్ణునకును భువనైక చ
రిష్ణునకును మణ్యాలంక రిష్ణునకున్ భ్రా

జిష్ణునకు లోకపావన
కృష్ణాతటినీతటాటవి కృతభూషునకున్ 24

క. దివిజేంద్రసేవితునకున్
గవివరసంస్తుత్యసుగుణ గణనిలయునకున్
భవరోగచికిత్సకునకుఁ
గువలయసంరక్షకునకు గోవిందునకున్. 25

క. గరుడాసనున కనంత
స్ఫురదురుచరమాంగశయన భోగాఢ్యునకున్
నిరుపమహారాన్వితునకుఁ
గరుణారసభరితమతికిఁ గాకుళపతికిన్. 26

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన వల్లభాభ్యుదయం బను శ్రీకాకుళ
క్షేత్ర మాహాత్మ్యంబునకుఁ గథాప్రారంభం బెట్టెదనిన. 27

ఉ. గణ్యులు తర్కభాష్యతతి కల్పితకావ్య కళాకలాప స
ద్గణ్యు లనేక యాగపరి తుష్టమనస్సుమనఃప్రసాదనై
పుణ్యులు పుణ్యకర్మకృతి పూత చరిత్రులు నైన నైమిశా
రణ్యధరాతలాంచితశ రణ్యమహర్షులు హర్షసంగతిన్. 28

గీ. అలరి విప్రసభాయుత విలసితముగ
శౌనకాది మహామునుల్ సత్రయాగ
కర్మకౌశల మమర జగన్నుతముగ
సూతకథిత పురాణసంప్రీతు లగుచు. 29

ఉ. తన్మఖవేళ సత్యసుకృ తవ్రతు లంచితవేదపారగుల్
చిన్మయసంవి దాత్తపరి శీలన శాస్త్రవిచారధీరు లు
ద్యన్మతివిష్ణుభక్తు లతి దాంతి శమాన్వితగాత్రులై[2] పది
న్నెన్మిదివిద్యలుం గల జి తేంద్రియు లాతతవీతమత్సరుల్. 30

1. చ. చరిష్ణులు 2. క. వంతులై.

సీ. మఱియు నత్రి వసిష్ఠ ఽ మైత్రావరుణి వామ
దేవ కౌశిక శుక ఽ దేవలాఖ్య
గౌతమ జాబాలి ఽ కౌండిన్య కాశ్యప
మాండవ్య శాండిల్య ఽ మందపాల
వ్యాస పర్వత భరద్వాజ పరాశర
హారిత వైశంపాయ ఽ నాదులైన
త్రిదశర్షి వరధరి ఽ త్రీసురమానులు
రాజతపోధనుల్ ఽ తేజమెసఁగ

నాగమాఢ్యులు మునివరు ఽ లేగుదేరఁ
దదనుమతి నంతబ్రహ్మవి ఽ త్ప్రవర జనులఁ
గాంచి శౌనకసంయమి ఽ కౌతుకమునఁ
బూజ లొనరించె నతులవి ఽ భూతి మెఱయ. 31

క. తదనంతరంబ వినయం
బొదవఁగఁ గుశలప్రశంస ఽ లొగిఁజేసి శుభా
స్పదమగు కావ్యం బెయ్యది 32
సదమలమతులార యనిన ఽ సంయమివర్యుల్

మ. పరతత్త్వస్థితి చిత్తవృత్తులయి స ఽ ద్బ్రహ్మాది వేదాంత త
త్త్వరహస్యప్రతి పాదులై నిగమసం ఽ భావ్యప్రసంగప్రక
ర్ష రసజ్ఞత్వకథానులాపదృఢచ ఽ ర్చాసాంద్రవిజ్ఞానత
త్పరు లయ్యుఁ బరమాత్మబోధకశుభ ఽ ప్రాగల్భ్యమేపారఁగన్. 33

క. తమలోన లెస్స శాస్త్ర
క్రమమున వేదాంతసరణి ఽ గంభీరరహ
స్యములెల్ల నరసి పొలుపుగ
విమలజ్ఞానానురాగ ఽ విశ్రుతు లమరన్. 34

శా. 'సత్యంజ్ఞానమనంత' శబ్దరచనా ఽ సాధారణంబైన యా
శ్రుత్యంత ప్రతిపాద్యు నవ్యయునిఁ జి ఽ ద్రూప్రుఁ మహాదేవసం
స్తుత్యబ్రహ్మవిరాజమాను హరి యం ఽ చుఁ నిశ్చయంబైనఁ దా
మత్యంతప్రమదాంతరంగసుషమా ఽ ధ్యానానులాపంబులన్. 35

క. హరివరద పరబ్రహ్మో
దర [1]శార్ఙ్గార్య బ్జశయ సుధాకరసహజా
ధర వాసుదేవ దాసా
దరణీయకటాక్షవిపుల తామరసాక్షా ! 36

వ. అని బహుప్రకారంబులం బ్రశంసింపుచు నిఖిల శబ్దశాస్త్రేతిహాసపురాణ వ్యాఖ్యాన చాతురీధురీణులైన యమ్మునివరేణ్యులు ధ్యానవందనకీర్తనీయశుభావహంబయిన శ్రీమన్నారాయణమూర్తి గుణకథలు వర్ణింపుచు 'తద్విష్ణోః పరమంపద' మ్మనుశ్రుత్యంత ప్రమాణవచనరచనా విశేషంబులం బరవాసుదేవునిఁగా భావించి దృఢనిశ్చయులై తద్దేవు నుద్దేశించి శ్రద్ధాగరిష్ఠనిష్ఠాపరులయి సత్రయాగక్రియా కలాపంబు [2]శాస్త్రోను సారంబుగా నొనరించుచున్న సమయంబున 37

నారదుఁడు శ్రీకాకుళ క్షేత్రమును బ్రశంసించుట.

ఉ. శౌరిగుణానుకీర్తనవి శారదుఁడయ్యును గేల వీణెఁ బ
ల్మారటు గోర మీటుచును లాపసుధారసధార లూరఁగా
శారదనీరదాభహరి చందనసుందరదేహుఁడైన యా
నారదమౌని వచ్చెఁ గరు ణాపరిణాహసురాగయుక్తుఁడై. 38

చ. తనమృదుగాన గుంభనవి తానము మాటికి నుగ్గడింపుచున్
వనరుహగర్భసంభవుఁడు వచ్చినఁ గన్గొని సంయమీంద్రులున్
వినయముతో నెదుర్కొనుచు వేగముగా నపు డర్ఘ్యపాద్యముల్
దనరఁగ నిచ్చి తా మతిము దంబున బూజ లొనర్ప వేడుకన్. 39

ఉ. అంత సుఖోపవిష్టుఁడగు నమ్మునిపుంగవుఁ జూచి వార ల
భ్యంతర మింతలేక యతి హర్షకులై కుశలప్రశంసల
త్యంతముఁ జేయఁ దా నతిము దావహుఁడయ్యును మీరు సేమమా
సంతసమా సమస్తముని సత్తములున్ మఱిసత్రయాగమున్. 40

క. అని యడిగిన నారదునకు
వినయోక్తుల నిట్టు లనిరి విప్రవరేణ్యుల్

1. క. శార్ఙ్గాద్యభ్యసయ. 2. యథాశాస్త్రాను

మునివర మీ రిటువేంచే
సిన నొసరె శుభంబు యాగ ఽ సిద్ధియు నయ్యెన్. 41

చ. అని మఱి హర్ష బాష్పపుల ఽ కాంకురసుందర మూర్తులయ్యు న
య్యనఘుఁ ద్రిలోకయానరతు ఽ నబ్జభవోద్భవు సర్వతీర్థవం
దనపరుఁ బుణ్యదేహుని ను ఽ దాత్తతపోధనుఁ డైన నారదుం
గని కొనియాడి మోడ్పుఁగర ఽ కంజపుటంబుల మ్రొక్కి వెండియున్. 42

ఉ. చింత దొలంగె యాగఫల ఽ సిద్ధియు నయ్యెను యజ్ఞదేవతల్
సంతస మంది రో దివిజ ఽ సంయమివర్య, మదీయ పూర్వ జ
న్మాంతర పుణ్యభాగ్య నివ ఽ హంబున మీ రిటు రాక గల్గె నేఁ
డెంత శుభం బటంచు వచి ఽ యించిరి మౌనివరేణ్యు లయ్యెడన్. 43

వ. దేవా, భవదీయ లోక సంచారం బస్మదాది జనంబులం బావనులం జేయుటకే కదా ! అదియునుంగాక మీ రాడని తీర్థంబులు మీరు సేవింపని దివ్య క్షేత్రంబులు ముజ్జగంబులం గలవే ? మహాత్మా, తావకాగమనం బెచ్చట నుండియో; సర్వంబునుం దెలియ వివరింపవలయు నని విన్నవించి మఱియును. 44

ఉ. ఎయ్యెవి పుణ్యదేశములు ఽ ఎయ్యెవిదేవనివాస యోగ్యముల్
ఎయ్యెవి సార్వకాలిక మ ఽ నేక [1]మహాజన రంజనంబులై
చయ్యన వారిరాశి కను ఽ సారములైన నదీనదంబు ల
య్యయ్యవి మాకుఁ దేటపడ ఽ నానతి యీవలయుం గృపానిధీ ! 45

వ. అని యడిగిన శౌనకాది మహామునుల కత్యంత కృపాయత్త చిత్తుండైన నారదుం డిట్లనియె. 46

మ. సవిశేషంబుగ నాలకింపుఁడు జగ ఽ త్సంచారినై యిప్పు డీ
యవనిం గల్గు తరంగిణీ నివహ పు ఽ ణ్యక్షేత్రముల్ గాంచుచో
శివమై యద్భుత దర్శనీయ మగుచుం ఽ శ్రీకాకుళ స్థానకే
శవ దేవాలయ మొప్పుచుండఁగను కృష్ణాతీర దేశంబునన్. 47

1. క. మహాజన దంబు నంబులై,

గీ. చూచి యట సహ్యజాస్నాన మాచరించి
మనసు విలసిల్ల సంధ్యాది మంత్రచయము
లంచితంబుగ నచట జపించి మఱియు
విష్ణుసన్నిధి కరిగి రోచిష్ణువైన. 48

గీ. భద్రకోటివిమానంబు ప్రభ దలిర్పఁ
గమలభవ నిర్మితోదార కనకరత్న
ఖచిత సింహాసన స్థితుఁ గమలనాభుఁ
గాంచి ముదమున సేవించి గారవమున. 49

సీ. రవికోటిసమతేజు రాజబింబాస్యుని
హాటకరత్న కిరీటకలితు
మకరకుండల భాస మానగండద్వయు
ఫుల్లాబ్జదళనేత్రు భూరిగాత్రు
శార్ఙ్గ నందక పాంచ జన్య సుదర్శన
కరచతుష్టయు దివ్య కంబుకంఠు
గ్రైవేయ కంకణాం గద మణ్యలంకారు
బింబఫలాధరుఁ బీతవాసు
లలితదరహాసు సుభ్రూవిలాసభాసు
శ్రీ సమాశ్రిత వక్షు లక్ష్మీకటాక్షు
బ్రహ్మరుద్రేంద్రపూజిత పాదయుగళు
నవ్యలావణ్యు హానిమానసశరణ్యు. 50

ఉ. చూచియు నెమ్మనం బలరఁ జోద్యముగా నిలఁ జాగి మ్రొక్కి వా
చా చటులత్వ వైఖరి వి శంకట వృత్తిని సంస్తుతింపుచున్,
లేచియు నాతపం బిఁక ఫ లించె నటంచును హెచ్చి గంతులన్
వైచుచు మాటి మాటికిని వందనముల్ ప్రకటించి యంతటన్. 51

ఉ. ఆ యెడఁ గేలుదోయి విన యంబునఁ గూరిచి ఫాళిఁ జేర్చి "య
ధ్యాయనుతాయ భక్తవర దాయ రమారమణాయ దేవదే
వాయ మునీంద్రగేయ పద పద్మయుగాయ శుభాయ కాకుళే
శాయ నమోనమో" యనుచు సాగి నమస్కృతిసేసి వెండియున్. 52

సీ. మత్స్యస్వరూపాయ ✽ మహనీయ కమఠాయ
దివిజప్రసన్నాయ ✽ తే నమోస్తు
ఆదివరాహాయ ✽ హర్యక్షరూపాయ
దేవతావినుతాయ ✽ తే నమోస్తు
వామనాయ గరిష్ఠ ✽ భార్గవరామాయ
దినకరకులజాయ ✽ తే నమోఽస్తు
బలరామకాఖ్యాయ ✽ పంకజనాభాయ
నిత్యాయ పరమాత్మ ✽ నే నమోఽస్తు
భద్రికోటి విమానాయ ✽ భాసురాయ
శ్రీమతే శాకుళేశాయ ✽ సామగేయ
వర నవాక్షర మంత్రాఖ్య ✽ వైభవాయ
శ్రీనివాసాయ హరయే న ✽ మోనమోఽస్తు. 53

వ. అని దండప్రణామంబు లాచరించి. 54

ఉ. కేశవ, చక్రపాణి, హరి, ✽ కృష్ణ, జనార్దన, వాసుదేవ, ల
క్ష్మీశుభ బాహుమధ్య, సర ✽ సీరుహనేత్ర, మహాతనుత్ర, ప
త్త్రిశతురంగ, శార్ఙ్గి, పర ✽ మేశ, సురర్షభ, పద్మనాభ, క్రి
వ్యాశనవైరి, శౌరి, కరు ✽ ణాకర, సంయమిలోకపూజితా. 55

క. అని కొనియాడుచు, నీగతి
వినయ వివేకానులాప ✽ విజ్ఞానమునన్
గనుఁగొని నమస్కరింపుచుఁ
దనివియుఁ దీరక నుదాత్త ✽ తత్పరమతినై. 56

వ. ఇట్లు నిలిచి ప్రతిదిన మహోత్సవంబు సేవింపుచున్నఁ బ్రాతర్మధ్యాహ్న
సాయంసమయంబులఁ బంచసూక్తమంత్రపఠనోత్కంఠకంఠులై యుపకంఠ
పీఠాధిరూఢులై శ్రీమహాభాగవతు లారాధనంబుసేయు సమయంబున. 57

సీ. భక్తిచే నతుల ప్ర ✽ బంధాను సంధాన
నిపుణత వైష్ణవ ✽ నివహ మలరఁ

దగ షడంగాది వేద ౹ దప్రపారాయణా
భిజ్ఞతవైదిక ౹ విసర మమరఁ
గమనీయతాళసం ౹ గతి గాన మొనరించు
పాఠకసముదాయ ౹ పటిమ దనర
రంభాసమాన వి ౹ జృంభ నర్తన కళా
కలిత లీలా [1] వార ౹ కాంతలాడ
భూరిభేరీ మృదంగ గం ౹ భీర మురజ
వాద్యజాతము లెల్లను ౹ వలను మీఱ
నతులగతిఁ జెలఁగి వాయింప ౹ నఖిలదిశలు
చెవుడువడఁగను దాపస ౹ శ్రేణి వొగడ. 58

క. గంభీర నాభికాకుచ
కుంభము లలరంగ నాట్య ౹ గురుగాన కళా
రంభలయి వారకాంతలు
కుంభార్తిక లల్ల నల్లఁ ౹ గులుకుచు నిడఁగాన్. 59

స్రగ్ధర. సేవింతుం గాకుళేశున్ ౹ సితరుచి సదృశ ౹ స్మేర వక్త్రం బవిత్రున్
దేవానీకారి జైత్రున్ ౹ దివిజ ముని గణ ౹ ధ్యేయకల్యాణ గాత్రున్
శ్రీవిష్ణున్ భక్తలోక ౹ ప్రియు గుణగణ వ ౹ ర్ధిష్ణు రోచిష్ణు జిష్ణున్
యావత్కృష్ణా తటిన్యా ౹ యతతటనిలయా ౹ ధ్యాసునిం గేశవాఖ్యున్. 60

ఉ. అంత మహామహుల్ హరి స ౹ మర్పిత తీర్థ మహా ప్రసాదముల్
కాంతముగా నొసంగుటయుఁ ౹ గైకొని కన్నుల నొత్తుకొంచు సు
స్వాంత నితాంత వైఖరిని ౹ సొపడి మీఱ నొనరించు యజ్ఞ వృ
త్తాంతము వీనుల న్విని ము ౹ దంబునఁ గన్గొన నేగుదెంచితిన్. 61

వ. మఱియు నద్దేవు మహనీయానుభావంబు గొనియాడ నలువ కయిన నలవి గాదు. భవదీయ యాగంబు సాంగంబుగా నొనరింప నర్హు లని యానతిచ్చి పోయివచ్చెద నన్నపుడు శౌనకాది మహామును లానిర్జర సంయమిప్రవరు నవలోకించి యిట్లనిరి. 62

1. కలితశా వారకాకాంతలాడ.

గీ. దేవ, శ్రీకాకుళేశు ప్రభావ మిపుడు
వినఁగఁ గడువేడ్క యగుచుండు వీను లలర
నాన తీవలె నన్ను న మ్మౌనివర్యుఁ
డాదరాయత్తచిత్తుఁడై యనియె నపుడు. 63

వ. అటఁ దననికటప్రదేశంబునం దనరు సూతసంయమిప్రవరు నవలోకించి యితం డఖిలశాస్త్రేతిహాస పురాణ వ్యాఖ్యాన చాతురీసమేతుండు భూతభవిష్యద్వర్తమానవేదియై కృష్ణద్వైపాయనానుగ్రహంబునం జేసి సర్వంబును నెఱుంగు నితం డానతిచ్చిన నంతయుం దేటపడు నని తత్కథావృత్తాంతం బంతయు సవిస్తరంబుగాఁ జెప్పుటకు న మ్మునివరు నియమించి వారిచే ననుజ్ఞాతుండై యప్పు డంతర్ధానంబు నొందె, నంత నిఖిలకిల్బిషహరు లయిన యా బ్రహ్మవాదు లాశ్చర్యానందభరహృదయు లయి తద్యజ్ఞంబు గడచన నొనరించియు ఋత్విజుల సదస్యులం బూజించియు ననేక దక్షిణ లొసంగి తదనంతరంబ క్రతుసమాప్తియందు నవభృథస్నానాలంకృతశరీరులయి సుఖోపవిష్టులయి నారదవచన క్రమంబున వ్యాస శిష్యుండైన రోమహర్షణి మనీషిం బ్రార్థించియు, నర్ఘ్యపూజలం దనిపియు సంతుష్ట హృదయునిం గావించి నిరీక్షించి యమ్మునివరేణ్యు లిట్లనిరి. 64

క. సూత, మహానుభావ, ఘన సువ్రత సాత్యవతేయశిష్య, వి
ఖ్యాతిగ విష్ణుమూర్తి యగు నమ్మహనీయు పరాశరాత్మజుం
డాతత వేదరాశి యిది యంతయుఁ దథ్యము తత్ప్రసాదముం
బ్రీతిగ నీకుఁ గల్గుటయుఁ బెంపుగ సర్వవిదుండ వి మ్ముర్విన్. 65

ఉ. కావున నానతీయి మ్మొగిఁ
దావకముఖ వచనరచన తజ్జ్ఞులు మెచ్చన్
దేవ హృషీకేశుఁడు ము
న్నేవననిధిప్రాంతవాసి యెచ్చట నిలుచున్. 66

క. కృష్ణా తీరంబున రో
చిష్ణుత నజుఁ డెట్లు నిల్పెఁ జిత్తం బలరన్

వైష్ణవ సత్తమ తెల్పవె
విష్ణుండగు కాకుళేశు ǂ విభవము మాకున్. 67

వ. అని యడిగిన సూతుం డిట్లని చెప్పం దొడంగె. 68

బ్రహ్మ కృష్ణాతీరమునఁ దపము చేయుట.

శా. వాణీభర్త హిరణ్యగర్భుఁడు పున ǂ ర్బ్రహ్మత్వముం గోరి గీ
ర్వాణుల్ మెచ్చఁగఁ బూర్వదిక్తటలస ǂ ద్వారాశిచెంతన్ సుర
శ్రేణీ సేవిత జహ్నుసన్మునిసుతా ǂ సీమన్ శుచిస్వాంతుఁడై
ప్రాణాయామపరాయణుం డయి తపం ǂ బత్యంతముం జేయుచున్. 69

మ. నిపుణత్వంబున శంఖ చక్ర ధరునిన్ ǂ నీలాంబుదశ్యామునిన్
జపమంత్రంబుల నాత్మలోఁ దలఁచుచున్ ǂ జాంబూనదాబ్జాళిచే
నుపచారంబు లనేకముల్ మనమునం ǂ దూహించి పూజింపఁగాఁ
గృపతో నమ్మహితాత్ము భక్తికి హృషీ ǂ కేశుండు లీలాగతిన్. 70

క. వేంచేసియు వాణీపతి
గాంచియు నియతేంద్రియత్వ ǂ గౌరవమున న
భ్యంచితతప మొనరించితి
సంచితమగుఁ దత్ఫలంబు ǂ చయ్యన ననుచున్. 71

క. అతి రూప దర్శనుండై
ప్రతిదర్శ సుదర్శనంబు ǂ ప్రమదం బలరన్
సతతముఁ గావించెద నని
యతి వేడుకతో సుదర్శ ǂ నాయుధుఁ డంతన్. 72

వ. మగిడి యొక్కదర్శయందు 73

సీ. సొంపుగా వేలుపు ǂ గుంపులు గొలువంగ
దేవతాధీశుండు ǂ తేజ మెసఁగ
దక్షుఁ డాదిగఁ బ్రజా ǂ ధ్యక్షులు తొమ్మండ్రు
స్వగణసమేతుఁడై ǂ శంకరుండు
శంసిత వ్రతులగు ǂ సర్వమునీంద్రులు
గ్రహతారకాదిత్య ǂ గణము మఱియు

వసువులు పాతాళ । వాసులు పుణ్యత
రంగిణుల్ రత్నాకరాంబు లెలమి
ప్రణవపూర్వక నిగమముల్ । ప్రథితముగను
సరసిజోద్భవ సేవిత । జహ్నుకన్య
కాతటంబున కేఁగియుఁ । గౌతుకమున
యోజనద్వయ పర్యంత । యుక్తులగుచు. 74

మ. పరివేష్టింప విరించి యుగ్రతపమున్ । భాగీరథీ తీర్థ నుం
దరుదారంగను జిన్మయాత్మకుని బ్ర । హ్మాండాధినాథున్ హరిం
బరమవ్యోమనివాసబింబము మదిన్ । భావించి సద్భక్తితోఁ
జిరకాలంబు తపంబు సేయఁగఁ గడున్ । శ్రీవల్లభస్వామియున్. 75

ఉ. ఆతని భక్తికిన్ మది ము । దావహుఁడై యరవిందమధ్యసం
జాతునిఁ గాంచి యిచ్చటను । జాలఁ దపం బొనరించి తింకఁ గృ
ష్ణాతటినీతటంబునఁ బ్ర । శాంత సమాహిత బుద్ధి చేఁ దపం
బాతటిఁ జేయు శీఘ్రముగ । నయ్యెడ కే నరుదెంతుఁ బుత్రకా! 76

వ. అని మేఘ గంభీర భాషణంబుల నప్పుండరీకాక్షుం డానతిచ్చిన విని విస్మయం
బంది యప్పద్మోద్భవుండు సంతుష్ట మానసుండై యాక్షణంబునం దన
మ్రోల నున్న మార్కండేయ మహామునీంద్రు నవలోకించియిట్లనియె. 77

ఉ. ఏ నిటఁ బూజ సేయు దక్షి । లేశ్వరుఁడైన రమామనోహరున్
మానితభక్తితో మును సమస్త షట్విష్టసుఖోపచారసం
ధానసపర్య లాగమవి । ధానము తప్పక యుండ నీవు ని
చ్చో నివసించి చేయు పరి । శుద్ధిగ మౌనిగణావతంసమా! 78

మ. అని నియమించి దా నతి ర । యంబున నేఁగఁగ మధ్య నొక్కచో
ననుపమకాననాంతర మ । హానది రమ్యతరంగడోలికా
కనదురురాజహంసము ఖ । గప్రకరాకుల తీర భూరుహం
బనువుగఁ గాంచి చోద్యముగ । నబ్జజుఁ డాత్మను తన్వి తీరకన్. 79

మత్త. పెక్కురూపములై కనుంగొని ప్రేమవిహ్వలుఁడై నయా
పక్కడాల్దొరబిడ్డ డంత నభంబునందు సమంబుగా
మిక్కుటంబగు రూపరేఖ నిమేషమం దుపసంహృతం
బొక్కతూరె రచించి మేదిని నొక్కఁడై యట నిల్చెనన్. 80

ఉ. అంతట నొక్కనాఁడు చతురాస్యునిపాలికి సర్వదేవతా
సంతతు లేగుదెంచి బహు సంస్తుతు లొప్ప నమస్కరించి వి
భ్రాంత మనస్కులయ్యు నతి రమ్యత నచ్చట యోజనద్వయం
బంతట నిల్చియున్ భవదు పాస్తికి నాశ్రయ మీస్థలం బిలన్. 81

ఉ. ఆకులమైన యట్టిభవ దాకృతి కామితభద్రదాయి, శ్రీ
కాకుల నామధేయ మన ఘంబుగఁ జేయు మటంచు వేలుపుల్
జోకలుగూడి వేడిన వచోవిభవంబు లనుగ్రహించె నా
లోకపితామహుం డమర లోకవిలోకన మాచరింపుచున్. 82

వ. ఇట్లు సర్వసుపర్వనికర జేగీయమాన ప్రార్థనానులాపంబుల నంగీకరించి
సంతుష్టహృదయారవిందుఁడై యరవిందభవుండు, పరమపావనంబును
నిఖిలపాపహారంబును కామితార్థప్రదంబును ముక్తిదాయకంబును నై
లోకంబునం బ్రఖ్యాతంబగు పుణ్యక్షేత్రంబుగా ననుగ్రహించి [1]నైజాకుల
నిదానంబునఁ గాకులాభిధానం బొనరించె ననంతరంబ బృందారక
బృందంబు పరమానందంబునం బొంది యన్నలువచేత ననుజ్ఞాతులై
తమ తమ లోకంబులకుం జనిరి. తదనంతరంబ. 83

చ. నలువయుఁ గాకుళాఖ్యశరణంబునఁ దొల్లిటికంటె సూటిగా
జలజదళాయతాక్షుపద సారసయుగ్మము నెమ్మనంబునన్
నిలిపి తపంబు సల్పఁ గరుణించి కృపారససింధుఁ డైన య
న్నలిన విలోచనుం డగుజ నార్దనదేవుఁడు సత్వరంబుగన్. 84

వ. చని పూర్వప్రకార వైభవంబున 85

సీ. శంపాలతోజ్జ్వల జలదంబుకై వడి
శ్రీదేవి యురమునఁ జెలఁగుచుండ

---

1. క. చ. "కైరాకుల"

రాకాశశాంకవి రాజమానాస్య 1 ప్ర
కాశ దిక్తటములఁ గలయఁ బర్వఁ
దరుణార్క-కోటి సుం దర కిరీటద్యుతుల్
దరహాసరోచులుఁ దడఁబడంగ
ముకురసమాన క పోలద్వయ ప్రభ
బింబోష్ఠకాంతి వి డంబ మలరఁ
జికురకనదళిక జలజ ప్రకటనయన
కంబు కంధర సుభ్రూ వి కాస మేరు
పర్వతోన్నత చంచ త్సు పర్ణ వాహ
నాధిరూఢతఁ దనరు వా హ్యాళి నపుడు. 86

సీ. శంఖ చక్రాంభోజ శార్ఙ్గ సంయుత చతు
ర్బాహాభిశోభి తో త్సాహుఁ డగుచు
శ్రీవత్స కౌస్తుభ గ్రైవేయ కేయూర
హారనూపుర పరి ష్కారుఁ డగుచుఁ
బీతాంబరోల్లసత్ పృథు కటిద్వయభవ్య
సర్వలక్షణ రేఖ చరణుఁ డగుచు
హర్యక్షమధ్యమ ధ్యమ నిమ్నతరనాభుఁ
డగుచును సమ విభ క్తాంగుఁ డగుచు
సురదిగీశముఖ నిత్య సూరి సేవ్య
గరుడ గంధర్వ దేవ కి న్నర పరీత
నారద సనత్సుజాత గా న ప్రసంగ
యోగిజేగీయమాన సం యోగుఁ డగుచు. 87

ఆ. అప్సరోగణంబు లానందముగ నాడ
దేవదుందుభులును దివిని మ్రోయఁ
బారిజాతకుసుమ పటలి వర్షింపంగ
సర్వమునులు 2దేవ చయము గొలువ. 88

1. చ. ప్రకాశము దిక్కు ల. పక్షాంతరమున ప్రకాశ చక్రితాదులలోఁ జేర్చుకొనవలసి యున్నది. 2. దేవ.

క. ఇవ్విధమునఁ బ్రత్యక్షం
బవ్వనజాసునిర్మాల ꠰ నవ్యయుఁ డాద్యుం
డవ్వనరుహాయతాక్షుఁడు
రివ్వునఁ జని నిలిచి యట వి ꠰ రించింజీరన్. 89

ఉ. లేచి నమస్కరించి [1]పది ꠰ లెంబుగ నప్పరమేష్ఠి మాటికిం
జూచి యనేకవారములు ꠰ చొక్కముగాఁగఁ బ్రదక్షిణించి కా
లోచితవైఖరిం గడు న ꠰ యోక్తుల సంస్తవలీలఁ గేశవ
శ్రీ చరణారవిందములు ꠰ చేరి నుతు ల్వొనరించి వెండియున్. 90

గీ. ఏను శంకరుండు ꠰ నింద్రాది దేవతల్
భానుఁడును శశాంక ꠰ భౌమ శశిజ
జీవముఖ్యు లెల్లఁ ꠰ దావకాజ్ఞావశ
వర్తులము ముకుంద ꠰ వాసుదేవ ! 91

వ. దేవా, దేవర సామర్థ్యంబు దెలిసి వర్ణింప నే నెంతవాఁడ, కారణరహితుండవు, కారణకర్తవు, అప్రమేయుండవు, ప్రమాణ దర్శనుండవు, కార్యశూన్యుండవు, కారణ నిపుణుండవు, నిర్గుణుండవు, అచ్యుతుండవు, జగదాధారుండవు, సత్యజ్ఞానానందస్వరూపశోభితుండవు, త్రివిధ హేతుభూతుండవు, నిఖిల చరాచరాత్మకుండవు, సర్వజ్ఞుండవు, అనామరూపకుండవు, నామరూపయుతుండవు, జగద్గురుండవు, పరమవ్యోమ నివాసుండవు నైన నీకు నమస్కరించెద. 92

సీ. శ్రీశాయ హరయే హృ ꠰ షీకేశ వేషాయ
జ్ఞానాయ విశ్వాత్మ ꠰ నే నమోఽస్తు
పంకజనాభాయ ꠰ భవ రోగ వైద్యాయ
దివ్యస్వరూపాయ ꠰ తే నమోఽస్తు
పరవాసుదేవాయ ꠰ పరమపవిత్రాయ
మానిప్రసన్నాయ ꠰ తే నమోఽస్తు
సరసీరుహాక్షాయ ꠰ సంకర్షణాఖ్యాయ
దితిసుతశిక్షాయ ꠰ తే నమోఽస్తు

1. “ పదిలెము ” అని వాడుకలోఁ గలదు. పదిలంబు—అని వ్రాఁతప్రతి—అప్పుడు యతిభంగము.

నిర్భరాయ పరబ్రహ్మణే నమోఽస్తు
ధీరసన్నుత చరణాయ తే నమోఽస్తు
ఇందిరానందకర శౌరయే నమోఽస్తు
దీనరక్షాయ వరదాయ తే నమోఽస్తు. 93

గీ. వాసుదేవ భక్త వరద జనార్దన
క్షీరసింధువిహిత శేషశయన
పుండరీకనయన పురుష పుంగవ వేద
వేద్య యనుచు నిట్లు వినుతి చేసి. 94

వ. మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించి పునఃపునఃప్రణామంబు లాచ
రించి హర్షపులక లెసఁగ నానంద బాష్పాకులలోచనుండై యున్న
యచ్చతుర్ముఖుం గనుంగొని పరిపంథి గర్వ నిర్వాపణ సమర్థుండును, భక్త
వత్సలుండును నైన శ్రీహరి యిట్లనియె. 95

మ. అతినిష్ఠం దపమాచరింప భవదీ యా మోద సద్భక్తికిన్
మతి నత్యంతము సంతసింపుచు నిలిం ప స్తోమముం గొల్వ నా
తత విశ్వాస విలాసవైఖరిని బ్ర త్యక్షంబుగా వచ్చి కే
నతుల ప్రాభవభాగ నీ కిపు డల భ్యం బేమి వేఁ దెల్పవే. 96

వ. అని మఱియును. 97

క. త్వదధీన మీ ప్రపంచము
సదమలగుణ లోకపాల సముదయము మునుల్
గద నీ యాజ్ఞావర్తులు
మొదల సృజింపంగ నీవె ముఖ్యుఁడ వనఘా. 98

గీ. అఖిల జగములు నీ యాజ్ఞ నడరుచుండ
సకలసంపద్విశేషంబు జరుగుచుండఁ
బ్రాకృతుని భంగి నాయాస పడు టదేమి
నీయభీప్సిత మెట్టిది నిజముగాను. 99

క. తెలుపుము కావించెద నని
పలికిన నప్పద్మభవుఁడు § ప్రమదం బలరన్
వలగొని నమస్కరింపుచు
నెలమిన్ లక్ష్మీశు తోడ § నిట్లని పలికెన్. 100

ఉ. దేవ మహానుభావ భవ § దీయదయాపరిలబ్ధసంపదల్
వావిరి సర్వలోక జన § పాలన కృత్యము నీ యధీనముల్
గావున నన్ను శంకరునిఁ § గల్పమున న్ననరించి రక్షణం
బీ వగుచున్ సృజించి హరి § యించుట కర్తల మమ్ముఁ జేసినన్. 101

ఉ. నీ యుపదేశ మార్గమున § నేను భవుండు భవన్నియోగమున్
బాయక యుందు మింక సదు § పాయ మెఱుంగఁ గృపాకటాక్షమ
త్యాయతయుక్తిఁ జేయు మఖి § లాత్మక భావవికారదూర చ
క్రాయుధ మన్మనోరథ ప § దార్థముఁ దెల్పెదఁ జిత్తగింపవే. 102

క. నిరతముఁ దావక భక్తియుఁ
బరగఁ బునర్జన్మమందు § బ్రహ్మత్వంబున్
దొరకుటకు నిన్ను వేఁడెద
వరమొసఁగవె భక్తిలోక § వరద ముకుందా! 103

వ. అని వెండియు. 104

ఉ. ఇప్పుడు నిన్నుఁ గూర్చి యిట § నే నొకఁడం దప మాచరింప నీ
చొప్పుగ సర్వ దేవతలు § సూరెల రాఁ జని నిల్చినట్టి యీ
దెప్పరపు న్నివాసము [1]వి § ధిప్రవరాకుల మయ్యెఁ గావునన్
దప్పక కాకుళాహ్వయ మె § సర్చితి దేవ యనుగ్రహింపవే. 105

గీ. తిరముగా నిందు సహ్యజా § తీరమందు
నిఖిల పరివార సంయుమి § నివహాయుతము
గాఁగ విహరించి తెంతయు § గౌరవమున
భుక్తిముక్తి ప్రదాయక § పురుష సింహా! 106

[1] "ప్రకరా".

క. లోకములోఁ బ్రఖ్యాతిగఁ
గోకుళపతి వసఁగ నిచటఁ ఽ గమలాసహితం
బాకల్పంబుగఁ బూజలు
గైకొనుమా దివిజ మనుజ ఽ గణములచేతన్. 107

వ. అని నిలింప జ్యేష్ఠుండయిన హిరణ్యగర్భుండు వేఁడినఁ జలత్కనక కుండల
భాసమాన గండయుగళుం డగు నప్పుండరీకాక్షుం డిట్లనియె. 108

క. ఉల్లంబున మద్భక్తియుఁ
గొల్లలుగాఁ గలిగి నట్టి ఽ గురుతరశక్తిఁ
జెల్లుఁ బునర్బ్రహ్మత్వము
నెల్లప్పుడు మదిని సంశ ఽ యింపకు పుత్రా! 109

ఉ. చైత్రముగా వసింతు మది ఽ సంశయ మింతయు లేదు కాకుళ
క్షేత్రనివాస మం దది య ఽ శేష విశేష చరిత్రపాత్రమై
ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కఁగ ని ఽ దానము దెల్పెద మత్పదాబ్జ సత్
పుత్రియునైన గంగ వరి ఽ తోషితరంగ శుభాంతరంగమై. 110

వ. మున్నొకనాఁడు సమస్తభూషణ భూషితయు, శుభ్రపరిధాన పరివృతయు
సురభి మృదుల కస్తూరికాసంకుమదమిళితచందనచర్చితాంగియునయి సరి
త్పతియగు రత్నాకరుం గదియనేతెంచిన నన్నదీవిభుండు కృష్ణాతరంగిణీ
లలనం గనుంగొని దరహసితముఖారవిందుం డగుచు నిట్లనియె. 111

ఉ. చూచితె సహ్యజాతటిని ఽ శుభ్రపయఃపరివారజాహ్నవి
ప్రాచరితంబు కేశవ ప ఽ దాశ్రయ మంబరకేశమూర్ధగ
మ్యోచిత మమ్మహావిభవ ఽ మొప్పునె నీ కని [1]సయ్యమాడ లో
నాచ కపత్రపాతిశయ ఽ మద్భుతమై యతిదారుణంబుగన్. 112

శా. నన్నుం గూర్చి తపంబు సేయఁగను గృ ఽ ష్ణాదేవి సద్భక్తికిన్
విన్నాణంబున కాత్మ మెచ్చి కరుణన్ ఽ వేంచేసి ప్రత్యక్షమై
కన్నే, నీతలఁపేమి తెల్పవె యనం ఽ గౌతూహలస్వాంత యా
చు న్నత్యర్థము లేచి మ్రొక్కి యనియెన్ ఽ స్రోతస్వినీకాంతయున్. 113

1. క. చ "సంహ్యామాడ"

గీ. ఉల్ల మలరంగఁ బద్మసం। ఫుల్లనయన
సన్నుతాకార దివిజ ప్ర।సన్నహృదయ
వర మొసంగవె నా యభి।వాంఛితంబు
విన్నవించెదఁ గరుణాప్ర।సన్న వరద! 114

చ. అనియు నభంగ భంగతర। హస్తము లల్లన సాచి మద్విభుం
డనిశముఁ గౌఁగిలించుకొను। నట్టి తటంబిట నిల్చి లోకపా
వని యని భూజనుల్ పొగడు। వైఖరి గల్గఁ గటాక్షదృష్టి ప్రా
పొనర వసించు మంచు విన। యోక్తి మహానది నన్ను వేఁడినన్. 115

వ. ఇవ్విధంబునం గొనియాడిన ప్రార్థనానులాపంబు లాకర్ణించి కారుణ్యోపేతమానసుండనై యట్లుసేయుదు నని యనుగ్రహించితి. పద్మజా, నీవు కోరికయు నివ్విధంబ కావున నిప్పుడీ యుభయకారణవశంబునం జేసియు నే నీరూపంబుతో ననేకకాలం బిచట వసియింపంగలవాఁడ; నట మీఁదం గలియుగం బాసన్నంబయిన జగత్పరిపాలన దక్షులగు క్షత్రియాధిపులు దుర్బలత్వంబునం జనిన విప్రజనంబు లాచారరహితులయి ప్రవర్తింపుచున్న నద్భుతదర్శనీయంబయిన మదీయ దివ్యరూపం బాత్మమాయ నాచ్ఛాదించి తొల్లిభవదీయోపకల్పితంబయినగంగాతరంగిణీతటంబునం బ్రవేశంబయి పూర్వప్రకారవైభవంబున నిల్చెద. నిచటమఱియును.

గీ. అంత భక్తులచేత న। ర్చాను బింబ
కల్పితాకృతి నిట నిల్పి। 1 కలియుగంబు
గడచి కృతయుగ సంప్రాప్తి। ఘనత నలరి
భువి సనాతన ధర్మ సం।పూర్ణమైన. 117

క. అట మీఁదట నే నీ కె
ప్పటిపటిమను మగిడి దృష్టి। పథమున నిలుతున్
సట గాదు నిజం బీ ము
చ్చట యింతయు వినుము నాభి। జాతక వత్సా! 118

1. కల్పితంబైన

వ. అని యిట్లు పరమపదాధిపతి యయిన హృషీకేశుఁ డానతిచ్చిన విని యప్పర
మేష్ఠి సంప్రీతచేతస్కుం డయి నానా రత్నఖచితకాంచన సింహాసనంబునం
దపోబలకల్పితంబైన భద్రకోటి విమానంబునం బరమాసనాసీనుఁగాఁ
బ్రధానపురుష విధానాగమోక్తంబుగా శ్రీపతిం బ్రతిష్ఠించి సమాహిత
చిత్తుఁడయి బ్రహ్మాది సురనికరంబు యథావిధిం బ్రదక్షిణ నమస్కార
పూర్వకంబుగా నిఖిలోపచారంబుల నుపచితివిశేషంబుల నుపాస్తి యొన
రింపఁగాఁ గతిపయదినంబులు గడచె నప్పితామహుండు తన మనోరథసిద్ధి
యగుటయు ననుజ్ఞాతుం డయి సత్యలోకంబున కరిగె నివ్విధంబున. 119

క. అని సూతుఁ డానతిచ్చిన
విని ముదమున శౌనకాది విప్రులు తరువా
తను నైన సమాచారము
వినిపింపు మటంచు నడుగ వేడుకతోడన్. 120

శా. పూర్వాంభోధిసమీపభూభువనస త్పుణ్యాశ్రమస్థాన గం
ధర్వాభిస్తుతి గానగుంభన చణో ద్దామాంధ్రనాథప్రధా
గీర్వాణాధిపతిప్రపూజిత హృషీ కేశాఖ్య చక్రాయుధా
శర్వాణీశసహాయ రమ్యతరకృ ష్ణాతీరదేశాధిపా ! 121

క. స్మరకోటిసదృశ కేశవ
తిరుమల సద్వంశజస్య దేశికజనతా
పరిముఖ భాగవ తార్చిత
వరసురమునిగేయ తెల్గువల్లభరాయా ! 122

మాలిని. నిరుపమగుణధారీ నిర్మలానందకారీ
శరధి వరవిహారీ శర్వరీచారవైరీ
గురుతరమణిహారీ కోవిదధ్యానసారీ
కరిరిపుపరిహారీ కాకుళక్షేత్రశౌరీ ! 123

గద్య. ఇది శ్రీమత్తిరుమల తాతగురుగురుచరణారుణాబ్జయుగళసమాశ్రయణ దురితలతాలవిత్ర హారితసగోత్రపవిత్ర భట్లపెనుమర్తికులోద్భవ గోపాలసచివతనూభవ విద్వజ్జనవినుతాభిరామ కోదండరామ ప్రణీతం బయిన బ్రహ్మాండ పురాణోత్తరఖండంబున వల్లభాభ్యుదయం బనెడి శ్రీకాకుళ క్షేత్ర మహాత్మ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

# వల్లభాభ్యుదయము.

## ద్వితీయాశ్వాసము



శ్రీరమణీ కుచకుంభప
రీరంభపటీర [1]ఘుసృణ ఘృష్టాలేప
స్ఫారభుజాంతరరుచిరా
కార ప్రవణాభిధేయ కాకుళరాయా! 1

గీ. సూతుఁ డంతటహర్షస మేతుఁ డగుచు
శౌనకాది మహాముని జనులతోడఁ
బలికె నిట్లని యప్పద్మ భవుఁడు తనదు
భువనము కరుగ సంయమి నివహ మచట 2

క. [2]ఆరాధన పరులయ్యును
నారాయణ పాదపద్మ నతనుతచతురో
దారధురీణత ననుదిన
మారాధన సేయుచున్న యవసరమందున. 3

మ. అరవిందాత్ముఁడు చక్రిసంతతముముక్షుధ్యాతు సంసేవ్యసుం
దరుఁడై [3] క్రమజనానురాగ ఫలసంతాన ప్రదుండై నిరం
తరకారుణ్య సుధాంబు [4]రాశియగుచున్ నానాముని స్తోమమం
త్రిరహస్యార్చితదివ్య వైభవములన్ రాజిల్లుచు న్నుండఁగన్. 4

క. ఈగతి శరత్సహస్రం
[5] బేగిన నా కాలమున మహీపతి విజయో
ద్యోగుఁడు భారతవర్షా
భోగధరాపాలనిపుణ పుణ్యాత్ముఁ డిలన్. 5

1. క. చ. మసృణ ఘుసృణాలేప. 2. చ. ఆరాధన పరమభక్తిని. 3. క్రమయనురాగ.
4. క. లన్ మెలఁగుచున్. 5. క. సేవిత.

సుమతి శ్రీకాకుళంబున నాంధ్రనాథుని సేవించుట.

క. [1]ఆతఁ డహార్పతి కులసం
జాతుఁడు సదసద్వివేక । చాతుర్యగుణో
పేతుఁడు దిగంతవినుత
ఖ్యాతుఁడు సుమతియను నృపుఁడు । ఘనమతియుతుఁడున్. 6

శా. దైవప్రేరిత చిత్తవృత్తి నిలపై । ధారాళసంచారసు
ప్రావీణ్యంబున నాంధ్ర భూతలముపై । రాగిల్లి యేతేర స
ద్భావబ్రహ్మర్షి మునీంద్రచంద్రనివహ । వ్యాప్తంబునై యొప్పునా
శ్రీవిష్ణుస్థలిఁ జేరనేఁగె నెలమిన్ । శ్రీకాకుళాఖ్యాకమున్. 7

వ. అది యెట్లనిన. 8

సీ. రథయూథ నేమిసం । రంభవిజృంభణ
దారుణగర్జన । ధ్వాన మణఁప
[2]కరిఘటాతత తురం । గ శ్రేణిఘట్టన
ధర నాదికూర్మ కర్పరము వగుల
శస్త్రాస్త్రనిచయ దోశ్చంచద్భటానీక
పదధూళి [3]రజనికాస్పదముగాఁగ
భేరీవిశాల గం । భీర భాంకారంబు
దిగిభసమాజంబు । [2]బెగడుపఱుప
బిరుదుపడగల గొడుగుల । తఱచు తరణి
కిరణపటలికి మాటు గాఁ । బరగుచుండ
చామరస్తోమరుచిరాభి । రాముఁ డగుచు
సుమతి చనుదెంచి నిలిచె సంభ్రమ మెలర్ప. 9

వ. అంత. 10

చ. అతిమతియైన యాసుమతి । సమ్మునివర్యులు గాంచి దేవతల్
శతముఖుఁ బూజసేయుగతి । సమ్యగుదీర్ణత నర్ఘ్యపాద్యసం

1. క. "ఆతఁడహారంతి". చ. "అహఃపతి". 2. క. "కుంభతా". 3. క. "ఘరము".
4. క. "దిగులుపడఁగ". చ. "బెగడు పడఁగ".

గతుల నభీష్ట సత్కృతులు గా ఫలసంచయ కందమూలసం
తతులు నొసంగఁగైకొని ముదంబున నమ్మునిసార్వభౌములన్. 11

చ. కనుఁగొని నన్ను మీర లధికంబుగ సత్కృతిసేయ నర్హమా
మునుల [1]సపర్యసేయుటయు ముఖ్యము మా కటుగాన నిప్పుడీ
వనమున మీ కభీష్టమగు వాంఛయొఱుంగఁగఁ జెప్పుఁడీ తగన్
మన మలరంగఁ జేతు నను మానము లే దని యానతిచ్చినన్. 12

శా. ఆరాజన్యవరేణ్యుఁ గాంచు మును లత్యంతప్రమోదంబునన్
శ్రీరమ్యాయతవక్షు నచ్యుతు విరించిప్రార్థితుండైనయా
[2]కారుణ్యామృతసాగరున్ వరుని శృంగారా న్వితున్ భక్తమం
దారున్ [3]ధీరజనార్చితున్ హరి రమా నాథుం బరంధామునిన్. 13

క. దర్శన మొసరించినను సు
దర్శనధరుఁ గాంచి నృపతి తద్దయు [4]మధుర
స్పర్శ వచనరచనలను వి
మర్శగ నడుగుటయు నలరి మౌని వరేణ్యుల్. 14

మ. అర లేకిచ్చట దేవతాలయకవాటానీకము [5]ద్వారగో
పురవీధీ పరిఘుణాభిమంటపచయంబుల్ భాసురాందోళికా
ద్యురు [5]యాన పరికరం బొనర్చి మఱి నిత్యోల్లాస మాసోత్సవో
త్కర సంవత్సర వైభవోల్లసిత కైంకర్యంబు లీస్వామికిన్. 15

క. నడపింప [6]వలయు నరవర
తడయక భవదీయ పాలితంబగు భువికిన్
[7]దొడవగును రమావల్లభుఁ
డడరున్ గడు వేడ్కతోడ నని వచియింపన్. 16

వ. ఇవ్విధంబునం బల్కిన యమ్మునిపుంగవుల వినయోక్తు లాదరంబున
నాలించి యప్పార్థివుం డి ట్లనియె. 17

శా. ఈదేవుండు మదీయసత్కులధనం బీయిందిరాధాముఁడే
దేదీప్యంబగు నాంధ్రనాథుఁ డనఁగన్ దివ్యస్వరూపజ్ఞులా

1. క. "సభాళిజే". 2. క. ణ్యామృతపూరితస్వరు". 3. క. "ధీరు జగజ్జేతుఁ". 4. క. మధురో వచనములను 5. క. ఉరప్రాసప్రకర. 6. క. పధియు. 7. క. దొడర
గల పుడమీవల్లభు.

భూదేవోత్తము లాలకించి విని సమ్మోదంబుతో భూవరుం
డాదిబ్రహ్మముఁ గాకుళాధిపుఁబద । ధ్యానప్రసంగంబులన్. 18

గీ. మ్రొక్కుచును మాటిమాటికి । ముదముతోడ
నఖిలపరిచరయుతముగా । నచట నిలిచి
యాంధ్రనాయకదాసుఁడనైననుచు నుడువ
నామహాహ్వయ మలరె నా । స్వామి కవని. 19

వ. అది నిదానంబుగాఁ గాకుళాధిపశ్రీనాథున కాంధ్రనాథాభిధానంబు యథార్థం బయ్యె ననంతరంబు సత్యసంధుండై యమ్మహీపతి యధికృతప్రతిజ్ఞాన్వితుండై [1]శ్రీదేశికోక్తముగ దీక్ష వహించి నిలిచియు, నేర్పరులగు [2]శిల్పివరుల రావించియు, వలనగు కళావేదులం బిల్పించియు, క్రియాకుశలులగు పరిజనంబులం గూర్చియు [3]యుక్తప్రయత్నంబున సకల సామగ్రి సమకొల్పి [4]వారలచే గోపురద్వారకవాట తోరణరత్నకుడ్య సాలభంజికాస్తంభాభిరామ మంటపవ్రాత దేవతాగార ప్రాకార నిర్మాణంబుల[5]ొనరింపుచు నానారమణీయమణిగణఖచిత కాంచన పరిష్కారంబులు గావింపుచు నెల్లెడలను భవనంబులఁ బరిమితస్థాపనంబులుగా రచియింపంజేసియున్న సమయంబున. 20

క. జలదాగమమున నవనీ
స్థలమున వర్షములు గురియ । సస్యము లలరెన్
కులగిరుల నుండి మెండుగ
సెలయేఱులు నిండి పాఱఁ । జెలఁగెన్ వఱదల్. 21

చ. అలర మృగేంద్రరాశి హరి । దశ్వుఁడు సేరఁగ సహ్యజానదీ
జల మతిపంకయుక్తకలుషం బయినం గని భూతధాత్రిని
ర్మల సలిలంబు గల్గమికి । రాజవరేణ్యుఁ డనూనకర్మ వి
హ్వలుఁ డగుచుండి మాధవు పదార్చన కెట్లని యూహసేయుచున్. 22

క. సలిలాశయ మొనరింపం
దలఁచియుఁ బూజార్హ మెట్లు । తగు నిపు డనుచు

1. క. "దేశిక యుక్తమున". చ. ఇదిలేదు. 2. క: "ధీవరుల". 3. చ. "బహు". 4. క. "హితులచే". 5. క. "లొనరించు". 6. క. "రచియించియుండు".

న్నిలనరయ భక్తజన వ
త్సలుఁ డగు భగవంతుఁ డపుడు ఽ చయ్యనఁ బలికెన్. 23

క. స్మరియించినఁ గనుఁగొనినన్
దురితములు దొరంగు నరునిఁ ఽ దుది బునరావృ
త్తిరహితపరమపదాశ్రయ
మిరవుగఁ గృపచే ననుగ్రఽహింతు హితవుగాన్. 24

క. చింతాకులాత్ముఁ డగు భూ
కాంతునిఁ గని ప్రియము నీకుఁ ఽ గావించెద నం
చెంతయుఁ బ్రసన్నుఁ డయిన య
నంతుఁడు హరి నిజ సుదర్శఽనముఁ గనుఁగొనుటన్. 25

వ. అవ్విష్ణుదేవు ననుజ్ఞంజేసి ప్రభాకర సంకాశ ప్రకాశంబై దైత్యచక్ర నిబర్హణం బగు చక్రం బతివిక్రమంబున భూతలం బతిరయంబున భేదించి రసాతల గతం బగు గంగా ప్రవాహంబు మనోవేగంబునం గొని వచ్చి సరోవరం బొనరించి క్రమ్మఱ హరిభుజాదండంబు నాశ్రయించె నది కారణంబుగా న త్తీర్థ రాజంబు చక్రతీర్థం బనఁ బరఁగె నంత. 26

మ. అది వీక్షించి సమస్త సంయమిచయం ఽ బా భూతలాధీశుఁడున్
మది సంతోషము విస్మయం బలర శం ఽ భల్లీల సుస్నానశ
శ్వదనుష్ఠానగరిష్ఠతన్ హరి సమ ఽ ర్చాచర్య లేపార భా
స్వదనూనంబుగ భర్మ చక్రము రచిం ఽ పం జేసి సద్భక్తిచేన్. 27

క. నిలిపియు భగవద్భక్తియు
గల వైష్ణవ సమితి నునిచి ఽ కైంకర్యంబున్
సలుప సుదర్శన పూజా
కలనం బలవడ నొసర్చి ఽ కాకుళపతికిన్. 28

గీ. అమల మణి దండ ధవళ ధ్వఽజాతపత్ర
చారుతర చామరౌఘ వృ ఽ త్తోరుపీఠి
కా ప్రశయ్యా మహాందోళి ఽ కానికాయ
ముకుర కాంచన భూషణ ఽ ములు నొసంగి. 29

1. క. " చెంతయు సుప్రసన్నుఁడై య ". చ. " చెంతయు మృదువుగఁబల్కె యను. "

చ. అగణిత విష్ణుభక్తు | లతియాగచయోచిత వేదశాస్త్ర పా
రగులు జితేంద్రియుల్ బహుపు | రాణ పరాయణ చాతురీ విశే
ష గుణ గణోన్నతుల్ కమల | సంభవ సన్నిభులైన విప్రులం
దగ నటు నిల్పి యంచితము | దం బలర న్నగరం బొనర్పఁగన్. 30

సీ. వకుళతమాల తిం | దుక బిల్వ సహకార
కామ్రాది తరు మహో | ద్యానములను
కలహంస సారస | కల్హార విలసిత
ప్రాకట సలిల త | టాకములను
సాల వితర్ది వ్రాజ | కవాట గోపుర
ద్వార ప్రఘాణ వి | తానములను
కనక మాణిక్య సం | కలిత నానాధాన్య
పూరిత భాసురా | గారములను
సలరె మత్స్యోత్తర శతత్ర | యాలయముల
మహిత భాగవత శ్రేణి | సహిత మగుచు
భూరితర దేవ మందిర | సూరియుతము
నిగమశరణము కాకుళ | నగరవరము. 31

సీ. శృంగార తర దివ్య | మంగళ పాఠక
స్తుతి గాన చణ నిత్య | సూరి జనులు
తిరుమణి తిరుచూర్ణ | తిలకోజ్జ్వలానన
శంఖచక్రాంకితా | జాను భుజులు
ధనురాది వివిధ సా | ధన తను త్రాణులు
రాజీవ నయనాభి | రామ ఘనులు
కమల కటాక్ష వీక్షణ కళావంతులు
నభినవ [1]కనక పీ | తాంబరులును
గలిగి భోగార్హ గరిమ ప్రకాశమాన
మగుచు మణిహేమ మంటపా | భ్యంతరాళి

1. క. "కనక వితానములు".

కముల నరలోక వైకుంఠ కలన నలరి
కాకుళాఖ్యాత పురము ప్రఖ్యాత మయ్యె. 32

ఉ. చందన హేమదుగ్ధకర సాల తమాల కపిత్థ తింత్రిణీ
తిందుక సింధువార వట తిల్వ పలాశ మధూక నింబ మా
కంద కదంబ జంబు సుర కాంచన పర్కటితుంబురాసన
స్యందన శాల్మలీ ప్రభృతి సాలవిశాల వనాళి రమ్యమై. 33

వ. అమరి మఱియు నమరాలయంబు తెఱంగున శక్రపాదపదేవవల్లభ వైభవంబును, సవన భవనంబు కరణి[1]యజ్ఞాంగాగ్ని శిఖా సముజ్జ్వలనంబును, యమనగరంబుభంగిఁ గాలస్కంధవార కాసార కమనీయంబును, నైరృతి నిలయంబునుం బోలె భూతావాస పలాశ భాసురంబును, ప్రచేత సుసదనంబు పగిది వరుణ శోభాంజన రంజనీయంబును, గంధవహు మందిరంబులాగున శ్వసనవాతపోత కలితంబును, అలకాపురంబుకైవడిఁ గుబేరవర కుందసుందరంబును, కైలాసంబుసొబగున నీశ్వరశివాసమన్వితంబును, యోగీంద్ర నివాసంబువడువునఁ బిప్పల శాండిల్య గాలవ కౌశిక తాపస విలసితంబును, భోగవతీ పుటభేదనంబువిధంబున నాగరంగసుషిరాయుతంబును, పర్జన్యభవనంబుమాడ్కి ఘనఘనసారఘుమఘుమాయమానంబును, లాస్యాగారంబు సొంపున గణికావిలాసినీనటతాళవితతంబును, సత్యలోకంబుచందంబున నజామోద బ్రాహ్మీవిరాజమానంబును, వైకుంఠంబు రీతి విష్వక్సేనాచ్యుత మోక్ష వైలక్షణ్యంబును నగు నారామంబు సకల జననయనాభిరామం బగుటయు. 34

ఉ. నాకులు మెచ్చఁగాకుళపు నారికెళంబులు నాకుఁదోఁటలుం
బోఁకల మానులుం బకుళ పుష్ప మహీరుహ గోస్తనీలతా
స్తోక సుమాలతీ ప్రతతి తోసరిరాక సురాలయంబులో
బ్రాఁకులు [2]తెల్లఁబోయినవి మానక మున్నవదాత రీతులన్. 35

ఉ. చారు వసంత మాసదివ సంబులు కాకుళ పట్టణోపకాం
తార నితాంతపల్లవవి తానసుమాతత భూజముల్ కలం

1. క. యజ్ఞాంగాగ్ని వైసభాస ముజ్జ్వల. 2. క. ప్రాఁకులు తెల్లన్ నార్చెనవి,

కారి గుడారుచీర లాగఁ గ్రమ్మి సురల్ పారి కంపినట్టి పెఁ
వారణ తార్క్ష్య సింహహయ వాహములు న్వాలె నుల్లసిల్లెడిన్. 36

గీ. నూతన లతాంతకిసలయా నోకహములు
మదన శరసంచయ విమాన మృదుతరాను
సరణిఁ బురుషో త్తమునకు వాసంతుఁ డంత
నపచితియోగ మొనరించె ననఁగఁ బరఁగె. 37

గీ. అలరు నలరులతో శారదాగమాళి
కేతనోద్ద్యో త మయ్యు ని కేతనోప
నిష్కుటంబుల ఘనసార నివహపూరి
తాలినిర్హారి [1]గరిమ నహర్నిశంబు. 38

గీ. అవసరములందు నుచితోపహారములుగఁ
బరువు దప్పకయుండ సు పర్వభూరు
హముల సుర లంపి రన నొప్పు నక్షయముగఁ
బురవనంబుల స త్ఫల భరిత తరులు. 39

సీ. సురదీర్ఘి కాంతర పరివాహ తరళిత
సుషమా విశేషా నిమిషు లనంగ
నుత్సవ సమయస ముల్లాస సలిలావ
గాహభాగవత యు గ్మంబు ననఁగ
మానస కాసార మహనీయ సంచార
రాజమరాళాభి రామ మనఁగ
వీచికాజాల శీతాచలసానులఁ
క్రీడించు కిన్నరా కీర్ణ మనఁగ
మునిఁగి తోఁగుచు సల్లాపమునఁ జెలంగి
యోల లాడంగ నొప్పు విశాలమీన
చక్రవాక లస త్క్రౌంచ చకిత విపుల
సారస విహారి సవ్యాజా చక్రవారి. 40

1. క. గరిమన.

సీ. కలకంఠ కాకలీ కల కలధ్వని నిష్కు-
టముల నిదాఘ కాలమున నమరు
నీరదవేళ మయూరముల్ చెలరేఁగి
పింఛముల్ విప్పి కుప్పించి యాడు
శరదాగమోదార సమయంబులను శుక
శారికా వ్యాహార పూర మొప్పు
మిహికావసరమునఁ దుహినాంశు బింబాస్య
లుపగూహన ర[1]వాతి విపుల మహిత
మగుచు శిశిరర్తుశోభితమై మహీరు
హములు మఱియును సరసీరుహములు ధాన్య
సస్యములు గోమనుష్యాది జంతు లలరు
సౌఖ్యతరముగఁ గాకుళ స్వామిభూమి. 41

క. నిరతము తిరువారాధన
జరుగ [2]నమృతపడికిఁ దదవసరగాంగేయాం
బరముల కయ్యాంధ్రాధిప
మురహరున కొసంగె నూళ్లు మున్నూటఱువై. 42

చ. మరి పరిచర్య సేయఁ దగు మానవ కోటిని దాసదాసికా
పరిజనముం సుగానచణ పాఠకవర్గము కాహళానకా
భిరుచిరభద్రవాద్యములు పేందు్రిన కర్పణసేసె సత్యసం
గరుఁ డగు రాజవర్యుఁ డధికప్రధితం బగు కీర్తిమంతుఁడై. 43

ఉ. తత్తర మింత లేక విదితంబుగ తద్ధిమితత్త తత్తతా
తత్త యటంచుఁ దాళగతిఁ దప్పక నాట్యము సల్పు నట్లుగాఁ
జిత్తజుబాణపంక్తు లనఁ జెన్నగు బిత్తరినాగవాసముల్
మొత్తముగాఁగ నిల్పెను నమోఘమనోరథుఁడై నయంబునన్. 44

క. పంచమహావాద్యంబులఁ
బ్రాంచత్కల్యాణవైభవం బొనరించెన్

1. క. చ. ధవాధివిపుల. 2. క. చ. జరుగను మరి పడితరావసర.

కాంచీపురి కేన యనఁగ ను
దంచద్గతి చైత్రశుద్ధ దశమి మొదలుగాన్. 45

ఉ. పౌర్ణిమ దాఁక నుత్సవము పంచమహానినదంబు లంబరో
దీర్ణ దిగంతరంబులఁ బ్రబ తిధ్వను లీన [1]దిశాధి నాథులా
కర్ణము నాలకించి విని కాంతలతోడ విహాయసంబునన్
భోర్న నుతించి రాసుమతి పుణ్యా మగణ్యా మటంచు మించగన్. 46

క. మరునాఁ డరుణోదయమున
సరసిజనయనుండు చక్రి చక్రాఖ్యస్సరో
వరమునకు సరిగి పరిజన
పరివారముతోన డిగ్గి భాసురలీలన్. 47

క. నీరాట మవధరించెన్
క్షీరాంబుధిఁ బవ్వళించు సిరిపెనిమిటి గం
భీరజలాశయమునఁ దన
నారాయణుఁ డనెడుమాట నాయము గాఁగన్. 48

చ. అవభృథమైన పిమ్మట వి హాయస కేతువు గాను దక్షిణన్
సవినయభంగి విప్రుల కొ సంగి మనోహర హారయోగ్య వ
స్తువు లుపహారముల్ వివిధ సూక్తవచః ప్రణుతుల్ చెలంగఁ గే
శవునకు నారగింపులు వి శాలముగా రచియింపఁ జేసియున్. 49

వ. ఇట్లు సకలవిధ కైంకర్యంబు లలవడునట్లుగాఁ బురంబునం గాపురంబులుగా సమర్పించి ప్రతిజ్ఞ సాంగం బగుటయు మహాత్ములగు తాపసోత్తములచే ననుజ్ఞాతుండై యా మండలేశ్వరుండు (శ్రీ) వల్లభున కతిభక్తి వినతు లొనరించి తదీయానుజ్ఞలు గైకొని భేరీకాహళాద్యపరిమితవాద్యవిశేష నినాదమేదురంబు గా మోదంబునం జతురంగసేనాసమేతుండై పూర్వ ప్రకార వైభవంబుతోఁ దన విశాలనగరంబునకుఁ జనియె నంత నక్కడ.

క. ఈ విధమున ద్రుహిణాది సు
[2]రావళియును సుమతివంశ జావనిపాలుర్

1. క. చ. దిశాధినాయకుల్ కర్ణములాలకించి. 2. క. రాధాముని. చ. సురావళిముని.

పావనకృష్ణాతటమునఁ
గావించు సపర్య లెల్లఁ § గైకొని మఱియున్. 51

క. శ్రీయుక్తిఁదనరి హరి సా
ఖ్యాయుత్తుం డగుచు నుండ § నబ్జజభవుఁడా
తోయరుహాక్షుని సన్నిధి
నీయాగక్రమము విని ని § రీక్షాపేక్షన్. 52

క. వచ్చి కనుంగొని క్రమ్మఱఁ
జెచ్చెరఁ దద్దేవభవన § సీమకుఁ జనియెన్
విచ్చలవిడిఁ దద్భక్తిస
ముచ్చయమునఁ జొక్కి దేవ § మునివరుఁ డంతన్. 53

వ. మఱియు నంత వేదాంతమయస్వాంతుం డయిన పారాశర్యుండు తొల్లి
గంగామధ్యంబున నుండియు. 54

చ. అనిశము వేదశాస్త్రనిచ § యంబులకెన్నఁ బరంబు లేదు త
ద్ఘనతర కేశవాహ్వయుని § కంటెను దైవము లేదు సత్య మం
చనఘుఁ డుదారవైఖరిని § హస్తము సాచి వచించె మేదినిన్
దనరఁగ సర్వలోకహిత § తత్పరబుద్ధిని విశ్రుతంబుగన్. 55

క. మేదినిలోపల సజ్జన
వేదితమై వేదమార్గ § విభవములందున్
జోదితమై చెలువొందును
వైదికకర్మంబులం ద § వశ్యము విధిమై. 56

ఉ. ఆచమనంబు సేయుటకు § నర్హము కేశవనామ మూర్ధ్వపుం
డ్రోచిత మంత్రరాజ మగు § నొయ్యన నమ్మహనీయతత్త్వ మా
లోచన సేయఁగాఁ దరమె § లోకచయాదిమసృష్టికారణం
బై చనునట్టి కేశవు మహామహిమంబు నుతింప శక్యమే. 57

ఉ. ఎవ్వఁడు భక్తినైనను యథేచ్ఛను నైన రమేశుఁ గేశవున్
నవ్వుచు నైనఁ బేరుకొనినన్ దురితౌఘము నాశమై చనున్

జివ్వనఁ గాలకింకరులు । చేరఁగలే రవసానవేళయం
దవ్వనజాయతాక్షుని ర । యంబున నెమ్మది సంస్మరించినన్. 58

గీ. చెలఁగి ముదమునఁ గాకుళ । క్షేత్రయాత్ర
చేయుటకు నెంచిలేచి సు । చిత్తు లగుచుఁ
దలఁచునరులకు లభియించుఁ । [1]దత్ఫలంబు
సికిన యాచక్ర తీర్థాభి । షేకు లగుచు 59

క. కేశవు సేవించినఁ గీ
నాశనివేశంబు గనరు । నరు లతిదురితా
వేశిత చరిష్ణులై స
ర్వాశనభుక్కులగు ఘనదు । రాత్మకు లైనన్. 60

వ. వెండియుఁ దత్క్షేత్రంబునందు. 61

క. తులసీకానన మిడి త
ద్దళదామము లెవరు భక్తి । తత్పరమతులై
యలరి సమర్పణచేసిన
నెలమిం గైవల్యకాంత । హిత వగుచుండున్. 62

గీ. భువి దురాచార సర్వాన్న । భుక్కృతఘ్న
పతితపాషండనాస్తిక । వ్రాత్యు లయిన
నాంధ్రనాయకు దర్శింప । ననుదినంబు
పరమగతిఁ జెందుదురు సుప్ర । భావు లగుచు. 63

క. ఫలదళకుసుమ సముద్గమ
విలసిత నానావనీజ । విహితం బై పెం
పలరు వసంతోత్సవమున
వలనుగ మధుమాసపూర్వపక్షమునందున్. 64

ఉ. ఏనరులైన శౌరిఁ బరమేశ్వరుఁ గేశవు శార్ఙ్గహస్తునిం
పైనముతో నుతించుచు ది । వాకరమండలమధ్యవర్తి గా
ధ్యానముచేయువారు దురితంబులఁ బాసి విమానయానులై
భానుసమీపమందున సు । పర్వులుమెచ్చ వసింతు రిమ్ముగన్. 65

1. చ. తత్ఫలంబునవిని.

చ. అమరగణాగ్రగణ్యు నఖిలాత్మకుఁ జైత్రవిశాఖపూర్ణిమా
సమయమునందు నెవ్వరు నిశాకరబింబముఁ గాఁ దలంచినన్
విమలయశంబునం బరగి వేల్పులు సన్నుతిసేయ నెమ్మదిన్
హిమకరలోకమందున యథేచ్ఛగతిన్ విహరింతు రెప్పుడున్. 66

క. తురగారోహుం డగునా
హరి కాకుళభర్త నెవ్వరైన నిరీక్షా
పరు లయి సేవించిన వా
రరుదుగ గంధర్వలోకమందుదు రెలమిన్. 67

గీ. కరివరారూఢుఁడైన శ్రీకాకుళేశుఁ
గాంచుమానవు లఖిలసత్క్రతువిశేష
ఫలచయసుగమ్య దేవేంద్రపదనివాసు
లగుదు రమరగణాన్వితు లగుచు నెపుడు. 68

మ. నరు లెవ్వారలు కాకుళేశ్వరు రమానాథున్ హృషీకేశునిన్
వరకంఠీరవయానుఁ డైనతని సద్భక్తిం బ్రసేవించువా
రురుకైలాసనివాసమందు శివసాయుజ్యంబునుం జెందియుం
దురు లక్ష్మీవరుసత్కృపామహిమ నిర్ధూతాఘసందోహులై. 69

శా. ఆశాభర్త లుదీర్ణసంస్తుతులు సేయ న్మేరుసంకాశ వా
కీశేశోజ్జ్వలయానుఁడౌ తఱి హృషీకేశున్ హరిం గాకుళా
ధీశుం గాంచినవార లాసనకయోగీంద్రాది లోకంబునం
దాశోభాన్వితులై వసింతురు సదాహ్లాదప్రశంసాత్ములై. 70

మ. రభసోద్రేకమరాళయానగతుఁడై రాజిల్లు శ్రీకాకుళ
ప్రభు లక్ష్మీలలనామనోహరు సుపర్వత్రాణు సేవించినన్
శుభమై సంయమిపూజితంబయి సుర[1]స్తుత్యంబునై సర్వదు
ర్లభమై యొప్పెడు సత్యలోక మవలీలం గాంతు రారూఢిగన్. 71

క. ఆతతగంధవహాశన
నేతపయి న్నిలుచు నాంధ్రనీరజనేత్రున్

1 క. చ. స్తూయంబునై.

జేతనులు గనిన నిలుతురు
శ్వేతద్వీపాది పుణ్య । సీమలయందున్. 72

చ. అతులిత తార్క్ష్యవాహనము । నందునఁ గాకుళభర్త సుందరో
న్నతముగ నేగుదేర సద । నంబులు వెల్వడి యెల్ల మానవుల్
నతినుతు లాచరించి యదసం బగునట్టి తదుత్సవంబునన్
కుతుకమతిం గనుంగొని వికుంఠమునందు వసింతు రెప్పుడున్. 73

చ. అనువుగఁ బూర్ణిమాహిమక । రాభ్యుదయంబు తెలుంగు [1]నన్ రథం
బున హరి కాకుళేశ్వరుఁడు । పొల్చినఁ గన్గొను వార లీ యిహం
బున నతిసౌఖ్యసంపదలఁ । బొంది శరీరవిముక్తులైన సం
తసముగ శాశ్వతంబగు పదంబున నిల్చెద రూర్జితంబుగన్. 74

వ. మఱియును. 75

చ. వసుమతిఁ జైత్రమాస సిత । పక్షమునన్ విధితార నైనను
న్వెస మృగశీర్షయం దయిన । విష్ణువసంత మహోత్సవంబు పెం
పెసఁగఁగఁ బూర్ణిమాంతముగ । నెవ్వఁ డొనర్చుఁ దదానుకూల్యసం
తసమున నెవ్వరైనను యథావిధి సంస్తుతి సేయువారలున్. 76

గీ. సకల భోగానుభవములు । త్సవమెలర్ప
నలరి దేహావసానంబు । నందుఁ బరమ
పదముఁజెందుదు రఘములఁ । బాసినిత్య
ముక్తిసంగతి నత్యంత । ముదితు లగుచు. 77

వ. మెండియు నిహలోకంబున వాంఛితార్థప్రదంబగు శ్రీకాకుళక్షేత్రంబు నందు.

ఉ. భారత వర్ష జన్య జన । వర్గము లాతతభక్తియుక్తి చె
న్నార వసంతమాసనమ । యంబునఁ జేయు మహోత్సవంబునన్
ధీరతతో దివి న్నిలిచి । దేవ సమూహములన్ మహాత్ములన్
వారక కాంచి మ్రొక్కుదు ర । వశ్యముగా నని మేషవైఖరిన్. 79

క. అభిలాష మలర సేవా
విభవంబునఁ గాకుళేశు । విధివంద్యు రమా

1. క. "వె(త్రదం". చ. "వ్రపదం".

విభుఁ బరిచర్య లొనర్చెడి
శుభజనములఁ గాంచి పొగడి సొగియుదు రమరుల్. 80

వ. సనాతనంబై ముక్తి బీజంబైన శ్రీకాకుళక్షేత్రంబున హరి కర్పణంబుగా దీపారోపాది కైంకర్య ధుర్యులై భజియించు మనుజవర్గంబు. 81

క. ఎయ్యవి కోరి భజించిన
నయ్యయ్యవి యొసఁగుచుండు నభిమత మలరన్
చయ్యనఁ గాకుళవల్లభుఁ
డయ్యెడఁ బరమాను రాగుఁడై యెప్పు డిలన్. 82

క. అనుపమ విద్యా కన్యా
ధనసుత కాముకులు నెలమిఁ దత్తత్ఫలముల్
కనుదురు సురలోకామృత
మనువుగ వాంఛించు వారి కవియె లభించున్. 83

గీ. తడయ కిల నాదిదేవునిఁ దపసు లెలమిఁ
గోరి దైవారఁ గాంక్షింపఁ గువలయమున
మంత్రసిద్ధియు నలవడు మహితముగను
గాకుళేశుప్రసాదంబు కతన నెపుడు. 84

గీ. సరస మగు కాకుళేశు ప్రసాద మహిమ
మలవియె నుతింప నవని నన్నలువ కైన
నట్టి కేశవదేవు న మర్పితాన్న
మఖిలపావన మతి దురి తాపహారము. 85

ఉ. దేవతలైనఁ గోరుదురు దీర్ఘ పవిత్ర మహాప్రసాదమున్
పావను లౌదు రీ నరులు భక్షణ చేసిన యంత బ్రహ్మహ
త్యావిల గోఘ్నకాంచనహ రాసవపాన మృషావివాద దో
షావలి నైనఁ బాసి విన యంబునఁ గేశవపాదభక్తులై. 86

క. ఇందుల కొక యితిహాసము
పొందుగఁ దెల్పెను వినుఁడు బుధవరు లిపు డా

చందము మున్ను పరాశరు
నందను సన్నిధిని వింటి నయముగ నెలమిన్. 87

వ. అది యెట్లంటేని. 88

సోమశర్మ కథ.

ఉ. మున్ను కళింగదేశమున మొక్కపుఁ బట్టణమందు నొక్కచో
నున్నత మందిరం బలర నుండెఁ గుటుంబినితోడ ధైర్య సం
పన్నుఁడు యజ్ఞశర్మ యను పాఱుఁ డుదంచితశోభనాంగి వి
ద్వన్నుతభాగ్య యాతని నితంబిని కాంతిమతీ సమాహ్వయై. 89

వ. ఉన్నంత నవ్విప్రకాంతారత్నం బొకనాఁడు, రజస్వలానంతరంబునం బుణ్యసరిజ్జలంబులఁ జలకం బాడి శుచియై తన విభు ననురాగాతిశయంబున మనంబున ధ్యానింపుచుం జనుదేర మార్గమధ్యంబున నొక శాకునికుం డెదురైనం గనుంగొని నిజనికేతనంబున కేతెంచి యహంబునం గృహంబునం గల ప్రయోజనంబు లొనరించి యనంతరంబ యా శర్వరీ సమయంబున శయనతలంబున మదనకదన విశారదుం డయినపతిం గవయు నెడ. 90

సుగంధి. బంగరాల రంగుమీఱు బోటి చన్నుదోయి సా
రంగనాభిచే భుజాంత రం బలంకరింపఁగా
ముంగురుల్ దొలంగఁ జేసి మోము మోముఁ జేర్చి యు
త్సంగపాళిపై రతి ప్రసంగ సౌఖ్య సంగతిన్. 91

క. తనరిన దైవ వశంబున
మనమున మును గన్న శబర మనుజుఁడు తోఁపన్
వనజాయతాక్షి కొయ్యన
సునయంబున గర్భ మయ్యె సుతుఁ డుదయించెన్. 92

వ. ఇట్లు జనియించిన డింభకున కుత్సాహాన్వితంబుగా జనకుం డగు యజ్ఞశర్మ జాతకర్మాది సంస్కారంబు లొనర్చిన సోమశర్మ యను పేరం బరగి పరుషభావంబునం బెరిగిన నుపనీతకాలం బగుటయు. 93

క. ఉపనీతం బొనరించియుఁ
గృప నధ్యయనంబు శాస్త్రకృతిఁ జదివింపన్

జపలతను బరిహరింపుచు
విపరీతగతిఁ జెలంగె విప్రాత్మజుఁడున్. 94

వ. అంత నుద్వాహానంతరంబ శిక్షాకాలం బతిక్రమింప యౌవనగర్వంబునం గలుషేంద్రియుండై పితృవిరోధంబుగా నటించుచుం దలిదండ్రుల నిరంతర విషాదాకులచిత్తులం జేయుచు మాతృస్మృతివిశేషంబునం దగని సహవాసగుణంబుచేత. 95

ఉ. వైదికకర్మముల్ విడిచి వారక కార్ముకపాణియై నిషా
దాదినికృష్టసంగతి ని రంతరముల్ గహనాంతరంబులన్
మోది మృగావళిన్ శరస మూహముచే వధియించుచున్ వృథా
మోదితసోమశర్మ కడు 1 మూర్ఖమునన్ జనుదెంచు నింటికిన్. 96

వ. ఇట్లనుదిన క్రూరకర్మారంభ సంభ్రమాభిరతుండయిన యాద్విజాధముం డఖిల బంధుజన పరిత్యక్తుండై రాజ్యంబు విడిచి దూర విదేశ గతుండై వ్యాధనిషేవితం బగు వనంబునకుం జని సంతుష్టుండై యుండి జీవాంతక వృత్తిఁ జరియించుచు భూతలంబునం గల దుర్బుద్ధులం గూడి కఠిన భావంబున నిర్దయుఁడై పురగ్రామాదులపయిం దాడివెడలి బహు ధనంబు లపహరించుచు. 97

చ. పథికుల విప్రవైశ్యజన వర్గముఁ, దక్కినయట్టి జాతులన్
వధ యొనరించి వస్తువు ల వశ్యముగాఁ గొని నర్మదాంధుఁడై
యధికధనంబు గూర్చి నిఖి లాన్వయజన్య శరీరులందు దు
2 ష్పథమునఁ గాంతిరూపయుత కాంతలఁ గాంచి రతాభిలాషియై. 98

క. తత్తద్బంధువు లందఱ
నత్తఱి వధియించి మన్మథాతురమతియై
యత్తరుణీ జన తరళో
న్మత్తక్రియ మద్యపాన మాంస జఘుత్సన్. 99

1. మూర్ఖతతో అని సవరింపవచ్చునుగాని కవి 'మూర్ఖ్యము' అను నర్థమున మూర్ఖము అని యుపయోగించెనని తోఁచెడిని. 2. ఇందు వర్గ ప్రాసము పయుక్తము. క. "దుష్ప్రథమున కాంతిరూపయుత కాంతల".

వ. తనరి నిరంతరశిశ్నోదరపరాయణుండయి సోమశర్మయుం బుత్త్రపౌత్త్రాభి
వృద్ధి నొంది గృహాంతరంబున దారుణపాపకర్మాభిరతిం జరియింపఁ
గొంత కాలంబు చనిన పిమ్మట నొకనాఁడు దైవ వశంబున. 100

చ. పెగవక కాకుళేశ్వరని ✽ వేదిత సర్వమహాప్రసాదముల్
పగవడిఁ గొంచు నాగమన ✽ పద్ధతి నుద్ధతి నేగుపాంథులన్
గర మపుడారఁ గాంచి కుతు ✽ కంబున నాత్మబలంబు లోప మం
చురవడిఁ దోడితేర వగ ✽ నొక్క నిషాదునిఁ గాంచి యుగ్రతన్. 101

వ. పరుసయి సమీపగతుం బయ్యె మదీయులగు నాయుధపాణుల నందఱ
సత్వరంబుగాఁ దోతెమ్ము నీవు వచ్చునందాఁక హితవగు సాధువాదంబుల
నిలిపెద నానావస్త్రాలంకార శోభిత లయి సర్వాంగరంగలగు నంగనాజనం
బులుం గలరని వారిం దనశబరాలయంబున కనిపి క్రూరాత్ముండైన యా
బ్రహ్మబంధుండు క్షుత్పిపాసాతుర పరిశ్రాంతుండునుం బోలె మార్గమధ్యం
బున నుండి చేరువకుం జనుదెంచినపథికవర్గంబునుం బొడగని వ్యాకులి
తేంద్రియుండై వృక్షమూలంబున లేచి వారలకు మ్రొక్కు లిడుచు
నిట్లనియె. 102

ఉ. ఎచ్చటనుండి రాక యిపు ✽ డెవ్వరు మీరు మహాత్ములార మీ
రచ్చపుఁబుణ్యశీలురు ద ✽ యాపరు లార్యులు సత్తపోధనుల్
వచ్చుట నాదుభాగ్య మన ✽ వచ్చుఁ గదా భవదీయ దర్శనం
బిచ్చుట గల్గె నా కిఁక న ✽ భీష్టఫలంబు లభించు నర్మిలిన్. 103

మ. అనుచున్ క్షుత్పరిపీడితాతురపిపా ✽ సాయత్తుఁడై దీనవృ
త్తిని మాటాడక ప్రాణముల్ వదలు రీ ✽ తిం గొంతసేపూరకుం
డి నితాంతాధ్వర మాత్మరక్షణకు సా ✽ టిం గాఁ దటంచున్ మహా
మును లెల్లన్ వచియింతు రంచుఁ బలుకన్ ✽ మోదంబుతోఁ దైర్థికుల్. 104

చ. కనుఁగొని సోమశర్మయెడ ✽ గారవ మార దయావిధేయులై
యనుపమ కాకుళేశ్వర స ✽ మర్పిత సాద మొసంగి తీర్థ మి

చ్చిన భుజియించి త్రావుచును ఽ జెచ్చెర నీపరమాన్న మేడదో
ఘనరుచిమంత మంచు నడు ఽ గన్ వినివారలు వానితోఁ జుతన్. 105

ఉ. ఓరి నిషాద, సర్వజన ఽ యోగ్యముఁ బాపహరంబుఁ బావనం
బీరుచిరాన్నపాన మఖి ఽ లేశ్వరకాకుళనేత కర్పితం
బై రసవంతమై తనరు ఽ నట్టిది నీదగుభాగ్యరాశి చే
న్నారఁగ నిప్పు డబ్బెను గృ ఽ తార్థుఁడ వైతి వటంచుఁ బల్కినన్. 106

క. ఆసోమశర్మ గడువి
శ్వాసంబున వారిఁ జూచి ఽ సావసహరిసం
వాస మగు కాకుళం బిట
కేసరణిగ నుండు నాకు ఽ నెఱిఁగింపుఁ డనన్. 107

గీ. సాగరాంబరయందుఁ గృష్ణా తటమున
సరసిజ విలోచనుఁడు శంఖ ఽ చక్రధరుఁడు
క్లేశహరణుఁడు నై హృషీ ఽ కేశుఁ డుండు
ననిన విని విస్మయం బంది ఽ వినయ మొసర. 108

వ. రాజసతామసగుణవిసర్జితుం డయి యాసోమశర్మ వారలతో ని ట్లనియె.

చ. అరయఁగ బ్రహ్మఘాతకుఁడ ఽ నాసవపానరతుండ గోఘ్నుఁడన్
పరవనితానురక్తుఁడను ఽ బాలసుఁడన్ శబరత్వకీతిగా
జరుపుచు నుండఁ గాలము ని ఽ షాదుల సంగతిచే సమస్త ని
ష్ఠురతర కర్మముల్ చెలఁగి ఽ శూరత చేయుదు నానుపూర్విగన్. 110

క. ఇవ్విధమునఁ బధికావళి
కవ్విధ మంతయును దెల్పి ఽ యనియెన్ మీ చే
బువ్వయు నిట భుజియించుట
చివ్వన మత్పూర్వ 1 కృత్య ఽ శేషముగాదే. 111

వ. అని మఱియును. 112

---

1. క. కృద్వ్య.

మ. తనదోషంబులు మాటికిం దలఁచి శుద్ధజ్ఞాన సుస్వాంతుఁ డ
య్యు నయో నీచవిచార వర్తనుఁడ సర్వోత్కృష్టదుష్కర్ముఁడన్
ఘనవిజ్ఞానద మస్మదీయ దురితఘ్నం బుత్తమక్షేత్ర మా
యనవద్యాత్మకుఁ గాకుళేశ్వరుని నత్యంతప్రమోదంబునన్. 113

క. కనుఁగొన వేడుక యయ్యెడుఁ
జనియెద నిదె పథికులార చయ్యన ననుచున్
వినయంబున వారలచే
ననుమతుఁడై కదలి నిజగృహంబున కెలమిన్. 114

క. ఏగి పదంపడి సుగుణో
ద్యోగతఁ దనవారిఁ బిలిచి యురుదుష్కృతిచే
నీగతి నాగతి యెల్ల దు
రాగతముగ జరుగుచుండె నని వారలతోన్. 115

వ. ఏను మున్ను విప్రాన్వయసంజాతుండం గాని నిషాదకులోద్భవుండఁ గాను అయినను నతిదారుణంబగు పాపకర్మాభిరతిం జేసి రౌరవాది నరకంబుల వలన నతిదరంబగు బాధల కనుగుణం బగుచున్నయది. మదీయంబగు కలుషం బేగతి నపవృతంబగు. పరమధార్మికులగు తలిదండ్రులం బరిత్యజించి, పుత్రవతియగు కులాంగన నెడఁబాసి వేదంబులు విడిచి వైదికాకాచారంబులు విసర్జించి గురువుల యాజ్ఞోల్లంఘనంబుచేసి సర్వంబునుం బరిహరించి నిషిద్ధ క్రూరకర్మంబులు మనఃపూర్వకంబుగా ననేకంబు లొనరించితి. ఇవి యన్నియు నిరయసరణి కిరవు లని నామనంబున నత్యంత సాధ్వసోద్రేకం బగుచు నుండుం గావున నిందుల కొకయుపాయంబు గలదు. నరుల కఖిలకిల్బిషఘ్నంబై పరమపవిత్రంబగునట్టి శ్రీకాకుళక్షేత్రం బను పుణ్యక్షేత్రంబు గల దని వింటి. తైర్థికజనావలివలన నద్దేవుని ప్రసాదంబుగొని భుజియించుటం జేసి యిట్టి జ్ఞానవైరాగ్యంబు లుత్పన్నంబయ్యె నింక తనుబంధసంబంధంబులు విడిచి యందుల కరిగి యథాసుఖంబుగా నిలువం గలవాఁడ నని వారలతో నిశ్చయించి యా సోమశర్మ

యభిమత ద్రవ్యంబులు గైకొని సత్వరంబుగా నుత్తమంబగు కాకుళక్షేత్రంబునం జేరె. అందు సమస్తదోషహారంబై లోకపవిత్రంబగునట్టి కృష్ణాసరిజ్జలంబులం గ్రుంకి చక్రాహ్వయ సరోవర తీర్థంబులందోఁగుచు ననంతరంబ హృషీకేశుఁడయిన కేశవదేవునిం దర్శించి సేవించి పావనం బగు తత్ప్రసాదఖాదనం బొనరించి యత్యంతభక్తియుక్తుండయి ద్విజవర విశ్వాసంబుగలిగి జితేంద్రియత్వంబునం గ్రోధమాత్సర్యంబులు లేక నిరంతరపరిచర్యాపరతంత్రుఁ డగుచు సకలోత్సవములు సేవింపుచుఁ బరిశుద్ధ మనస్కుండై కొన్నివర్షంబు లుత్కర్షంబుగా నిలిచి, పదంపడి దేహావసాన సమయంబున, నింద్రాదుల కందరాని లోకోత్తరం బన నొప్పుచు నిరంతర సంపత్కరంబగునట్టి శ్రీ విష్ణుసాయుజ్యముం బ్రాపించె నివ్విధంబున. 116

క. కావునఁ గాకుళవల్లభు
సేవాపరతంత్రవృత్తిఁ జెందినవారల్
పావను లగుచును సదమల
భావంబునఁ బరమ పదముఁ బ్రాపింతు రొగిన్. 117

మ. వ్రతయాగాది సమస్త సత్క్రియల నల్ప ప్రౌఢిఁ గావింప శా
శ్వత వైకుంఠ నివాస మబ్బునె రమాభర్త పరంధాము సం
తతకల్యాణ గుణాను కీర్తనలచే తం గాక, నింద్రాది దే
వత లెల్ల [1]భజియించికారె విబుధైశ్వర్య ప్రభావాన్వితుల్. 118

ఉ. మానుగ విష్ణుదేవుని సమస్త జగత్ప్రభు వేదవేద్యు సన్
మౌని మనోనివాసు హరి తామరసాక్షుఁ జతుర్భుజున్ గుణాం
భోనిధి శంఖ చక్ర ధరుఁ బుణ్యచరిత్ర కథానులాపముల్
జానుగఁ బద్మజాది సుర జాలములైన నుతింప శక్యమే. 119

చ. అతులదురాత్ముఁడైన వినయంబున సంస్మరియించెనేని నా
తతపునరుద్భవాది రహితంబగు నిత్యవిభూతిఁ జేర్చు శా
శ్వత నతవత్సలుండు పరవాసవిభుండు సనాతనుండు సూ
నృతనుతసూరిదివ్య మహనీయుఁడు కాకుళభర్త మేదినిన్. 120

1. క. “ భజియించి కాదె ” చ. “ భజియించి కాదె ద్విజుడైశ్వర్య ”

సీ. అట్టి సరోజాక్షుఁ డాద్యంతశూన్యుండు
దరచక్ర కమల గదాధరుండు
దర్పకకోటి సుందర భాసురాంగుండు
శ్రీరమాదయితుండు శేషశయనుఁ
డబ్జజ ప్రార్థితుం డగుచును కాకుళా
ధ్యక్షుఁడై కరుణా కటాక్షుఁ డగుచు
నిలిచినయది మొదల్ నిత్యోత్సవచయంబు
సత్పుణ్యనిరతు లా సర్వజనులుఁ
గోరి సేవింప సవ్యాజ కాలమునను
నభిమతార్థము లిచ్చుచు ననుదినంబు
మహితమగు భద్రకోటి విమానమందు
సంతతోత్సవ మలర వత్సలత దనర. 121

క. ఉన్నట్టి కాకుళేశ్వర
సన్నుత మాహాత్మ్య మిపుడు సంగ్రహముగ నేఁ
దిన్నగఁ దెలిపితి నలవియె
వెన్నుని మాహాత్మ్య మెల్ల వివరింపంగన్. 122

క. అని పలికి యూరకుండిన
వినయంబున సూతు గారవించియును సనా
తన వృత్తాంతముఁ దెలిపితి
వనఘా మనమునకుఁ జాల హర్షం బయ్యెన్. 123

చ. అట నిఁకముండెటన్ గలియుగాగమ మైనను జహ్నుకన్యకా
తటమున కేగు నంచును బదంపడి వేఙ్కట బింబమందు ను
త్కటముగ నిల్చియున్ కృతయుగంబుకుఁ గ్రమ్మరి పూర్వరూప వి
స్ఫుటముగ వచ్చు నంచును నపూర్వముగా వచియించి తెంతయున్. 124

ఉ. ఏ గతి జాహ్నవీ తటికి నేగి వసించు రమా మనోహరుం
డాగమభోగశాలి పున రాగతుఁ డెట్లగు నాంధ్ర భూమికిన్

మీఁగడ పాలభంగి రుచి మిక్కుటమైన తదీయ సత్కథల్
వేగమె మాకు నీవు వివరింపవె సూత కృపాసమన్వితా. 125

చ. అని మును లాన తిచ్చిన ద యాహృదయుండగు సూతుఁ డిట్లనెన్
సనకసనందనాది ముని సన్నుతుఁ డైన రమాకళత్రుఁ డా
యనుపమ కాకుళాహ్వయ మ హానగరిన్ బహుకాల ముర్విలోఁ
దనరి సమస్త కామ్య ఫల దాయకుఁ డౌచు నపారవైఖరిన్. 126

క. విహరింప నంత మీఁదటఁ
దహతహముగఁ గలియుగంబు దారత దోఁపన్
విహితానుష్ఠానకళా
సహిత ద్విజవరులు బుద్ధి జాడ్యత నరుగన్. 127

మ. వ్రత శౌచంబులు మాని మానవులు దు ర్వ్యాపార సంచార స
ర్మతులైనం గని భూతధాత్రి నిలయ ప్రాకారవారంబుతో
డుత నంతర్హితుఁ డయ్యె భూమిగుహ నుం డున్ దేవతానీక పూ
జితుఁ డౌచున్ హరి నాగలోకతలవా సిత్వం బనూనంబుగన్. 128

గీ. వరుణ భుజగేంద్రు లచట సపర్య సేయ
నిలిచి మణిమయ భూషణో జ్జ్వలితుఁ డగుచు
గహ్వరీగర్భమందున గతిఁ జరించుఁ
గృత యుగము వచ్చు నందాక నతుల మహిమ. 129

క. పదపడి కృత యుగ మరుగన్
ముద మొదవఁగ మగిడి వచ్చి మునుపటి భంగిన్
హృదయానంద కరంబుగ
సదమలగతిఁ గాకుళమునఁ జరియించు నిలన్. 130

వ. ఇవ్విధంబున దేవదేవుం డంతర్హితుం డగుటయు నుత్తమంబగు చక్రతీర్థ
సరోవరంబు బహిష్కృతంబై యుండుటం గనుంగొని లోకపావని యైన
సహ్యగిరిజానది సెమ్మనంబున నుపాయం బూహించియుం దనయందు

న త్తీర్థరాజంబు నంతయ్యాభతం బొనరించు ననంతరంబున ననేక వత్సరంబులకు గంగాకూల శ్రీవల్లభ దేవు డత్యంత సంతుష్టాంత రంగుం డగుచుం దనయంతం దానె తద్దేశంబునం గూర్చి రాఁగలం డని చెప్పిన విని శౌనకాది మహా మునులు సంయమి శ్రేష్ఠుండైన సూతు నవలోకించి యిట్లని పలికిరి. 131

ఉ. సూత కృపాసమేత పరి । శుద్ధిగఁ దత్కథ విస్తరించియుం
బ్రీతిగ లెస్స మాకు విని । పింప వినం గను వేడ్క వృద్ధియా
శ్రీతరుణీ వినోదియుఁ బ్ర । సిద్ధిగఁ దాఁ జనుదెంచి లోక వి
ఖ్యాత కుతూహలం బలరఁ । గాకుళ మందు వసించు నేగతిన్. 132

వ. అని యడిగిన. 133

శా. పూర్వాచార్య పరంపరాభినుత సం । పూర్ణప్రభావాన్వితా
చార్వాకాగమబంధురాంధతమసో । చ్చండాంశు దైతేయరా
డ్గర్వాఖర్వశిలోచ్చయోచ్చలన కృ । త్కాండస్వరూపద్భుజా
సర్వైశ్వర్య ఫలప్రదాయక జగ । త్స్వామీ రమానాయకా ! 134

క. శతధృతి నుత కరుణామయ
వితత ప్రథితాభిధాన । వేదాంతార్థా
న్విత మహిత సర్వదేశిక
నత సతత కృపాకటాక్ష । నళినదళాక్షా ! 135

పంచచామరము. పరాపరాత్మకాంధ్ర నాథ । ద్వారమందిరాంగణ
స్ఫుర ద్విచిత్ర వైభవాఢ్య । శోభమాన సహ్యజా
సరిత్తట ప్రదేశవాస । సారసోద్భవార్చితా
దరిద్ర దుఃఖతూలజాల । దావపావకప్రదా. 136

గద్య. ఇది శ్రీమత్తిరుమల తాత గురు గురుచరణారుణాబ్జయుగళ సమాశ్రయణ దురితలతాలవిత్ర, హారితసగోత్రపవిత్ర భట్లపెనుమర్తికులోద్భవ గోపాలసచివతనూభవ విద్వజ్జనవినుతాభిరామ కోదండరామప్రణీతంబైన బ్రహ్మాండపురాణోత్తరఖండంబున వల్లభాభ్యుదయం బనెడి శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యంబునందు ద్వితీయాశ్వాసము.

---

# వల్లభాభ్యుదయము

## తృతీయాశ్వాసము



శ్రీధర తరుణారుణబిం
బాధర దరహాస విలసి । తానన కలశాం
బోధిశయానా నతజన
బోధక తిరునాళ్ల రాయ । భూసురగేయా. 1

గీ. ఇయ్యకొని సూతుఁ । డంతట నిట్టు లనియె
శౌనకాది మహామునీ । శ్వరులతోడ
మును విరించియు నియమింప । మొనసి త్రిపథ
గాతటంబున నపచితి । కరణ మమర. 2

గీ. అలమృకండుతనూభవుఁ । డనుదినంబు
శ్రీరమావల్లభ స్వామి । సేవసేయు
చుండి యొకనాఁడు మునిగణో । ద్యుక్తుఁడై వి
శేషమగు తీర్థయాత్రాభి । లాషియగుచు. 3

క. అనువుగ శ్రీవల్లభుతోఁ
జనుటకుఁ బరిశుద్ధమైన । సజ్జయునొకడుం
గొనివచ్చి యందులోపల
నునిచియుఁ గొనిపోవ నప్పు । డూహించి వెసన్. 4

చ. తనకరపంకజాతములఁ । దామరసాయతనేత్రుఁ బట్టి యె
త్తను మునిశేఖరుం డపుడు । దాత్తబలంబునఁ బెన్గియాడి యం

తను నతిహీనసత్త్వుఁ డయి । తద్దయు విస్మితుఁడై రమావిభుం
గనుఁగొనఁగా వియద్వచన । కాంత నితాంతనినాద మేర్పడన్. 5

చ. ఓయి మృకండుసంయమిత । నూద్భవ యింతఁ బెనంగ నేల వ
ల్దో యన మావిభుం డిచట । నుండఁగ నెమ్మది నిశ్చయించి త
త్తోయరుహాక్షుఁ డబ్జభవు । తో హితసంగతిగాఁ బ్రసన్నుఁ డీ
చాయఁ దొలంగి నీకు సర । సం జనుదెంచునె తీర్థయాత్రకై. 6

వ. కావున. 7

క. జననుత నీవ యథేచ్ఛన్
జను మని యాకాశవాణి । చయ్యనఁ బలికెన్
విని యాశ్చర్యమనంబున
మునివరుఁ డటు నిల్చెఁ గేలు । మొగిచి వినతుఁడై. 8

## అహిచ్ఛత్రపుర వృత్తాంతము.

వ. ఇవ్విధంబున మార్కండేయుం డక్షణంబ ప్రదక్షిణ నమస్కారంబు లొనరించి తీర్థయాత్రాపరుండై యరుగుటయు నంత నలువ కెన యనం దగు ద్విజసమాజంబుచేతఁ బూజితం బగుచుఁ గమనీయ విగ్రహంబైన శ్రీవల్లభ దేవు సేవార్థంబుగా మహామతియను మహీపతి దండప్రణామంబు లాచరించి సమాహితచేతస్కుండై యున్నసమయంబున నప్పట్టణాధివాసద్విజులతో నితరబౌద్ధమతజనుల కత్యంతరాద్ధాంతవాగ్వివాదంబగుటయుఁ గనుంగొని యద్ధరాధినాథుండు విదితంబుగా వారలతో నిట్లనియె. 9

క. మీలో నుభయత్రలు మది
నాలోచన దోఁచి మత్ప్రి । యంబుగఁ జెప్పం
జాలినవారి మహాకుల
శీలురుగాఁ దలఁచి విశ్వ । సించెద మదిలోన్.

గీ. అధము లగుదురు తెలియలే । నట్టివార
లనుచు నిరుపక్షములవారి । ననునయించి

పలికి ధరణీశుఁ డాత్మీయ నిలయమునకు
నరిగి యొయ్యన నతి రహస్యంబుగాను. 11

శా. ఘోరంబైన విషోరగంబును మహాకుంభంబులో నుంచి యొ
ప్పారం బై నొక యంశుకంబు పదిలంబౌనట్లుగాఁ గట్టి శృం
గారాస్థాన సభాంతరంబున నిరాఘాటంబుగా నిల్పి సం
స్మేర స్ఫారముఖారవిందుఁ డయి భూమిస్వామి యవ్విప్రులన్. 12

మ. ఇరుపక్షంబులవారితో ననియెఁ దా నీకుంభనిక్షిప్త బం
ధురసద్వస్తువుఁ జెప్పుఁడీ యనుచు బౌద్ధుల్ తద్ఘటిం జూచి భా
సురచర్మాంబరతి దందశూక మనుచున్ శోధించి యిట్లానతి
త్తురు దర్వీకర మంచు [1] నిశ్చయితఁ దోడ్తో ద్విజశ్రీ రుక్తంబుగన్. 13

చ. పదపడి వైదికోత్తములు పార్థివుఁ గన్గొని సర్పమైన నీ
యదనున మా యనుగ్రహ మహత్త్వమునన్ ధవళాతపత్త్రమై
యొదవు నటంచుఁ బల్కఁగ నయోక్తులు వీనుల నాలకించి య
వ్వడువునఁ దద్ఘటోపరిసుబంధనశాటి వదల్చి పెల్చనన్. 14

గీ. అంశుకము దిగిచి నరవరుఁ డమలధవళ
తాతపత్త్రంబు గని మహాహ్లాద మొనఁగ
విప్రులను బూజసేయుఁ బవిత్రు లనుచు
బౌద్ధు లంతట వైదిక భావమొల్ల. 15

గీ. విడిచి రాష్ట్రంబు నందున వెడలి పోవ
నది నిదానంబుగా జగద్విదిత మగుచు
నలరు నాపట్టణంబున కాహ్వాయంబు
భూరి మహిమ నహిచ్ఛత్త్రపుర మనంగ. 16

వ. అట (శ్రీ)ధరుండు. 17

క. అక్షీణవిభవ మలర బు
భుక్షుసదృక్షావనీశ పూజితుఁడై ప్రి

1. క. చ. నిశ్చయత.

త్యతు మహీచ్ఛత్రి పురా
ధ్యక్షుండై వికచబిసరుహాక్షుం డగుచున్. 18

వ. అమరి మరి నిఖిలలోక నమస్కృతుండై యత్యంత తేజోవిరాజితుం డగు రాజీవాక్షుం డనేకకాలంబు గడచిన పిమ్మట నాంధ్రదేశంబునం దనరు శ్రీకాకుళంబున కేగు తలంపు నెమ్మనంబునం బొడమిన. 19

ముక్కంటి మహాజనపతి కథ.

క. అంతట వింధ్యమహీభృత్
ప్రాంతంబున నర్మదాతరంగిణిచెంతన్
కాంతారమధ్యమునను ని
తాంతం బగు నొక్క శబరధామం బమరన్. 20

సీ. అచట నచ్యుతశర్మ యను నొక విప్రుండు
నర్మదా నిమ్నగాస్నానపాన
పర్యుడై చన ధర్మవైభవాన్విత యైన
భార్యతో నిలుచు నప్పట్టణమున
నాతనిసుత విశాలాక్షి సుందరరూప
గుణవతి సజ్జనప్రణయమతియు
నగు తత్కుమారికకక చిరకాలంబున
జనయిత్రి మృతిఁ బొంద జనకుఁ డపుడు
మాతృహీనయు నై యున్న మగువఁ గాంచి
తనయఁ దోడ్కొని యతిదూరమునకు నరిగి
యవనిపై నొక్కచోట యయాతికుల స
ముదితనృపతులు పంచకేయూర ముఖులు. 21

[illegible]. ఉన్నంత నచ్చట. 22

ఉ. స్థాపనచేసి యా ద్విజుఁడు దాత్త తపం బొనరింపఁ బోవ నా
భూపకులావతంసు లతిపుణ్యులు నైన యయాతి వంశజుల్
పావని సోదరీప్రణయపద్ధతి బుద్ధిఁ దలంచి నిత్యముం
రూపకళాభివృద్ధిఁ గని రూఢిగఁ బెంప వివర్ధమానయై. 23

గీ. పెరిగి యంతట యౌవనో పేత యగుచు
నున్న యకన్నియను గాంచి యుగ్రుఁ డలరి
వారణాసికిఁ జని విప్రు గారవించి
యడుగ నబ్బాలిక నొసంగ నచ్యుతుండు. 24

సీ. ఆ బాలికారత్న మందు శంకరువంశ
మున జనియించు నందనుఁడు ఘనుఁడు
తన్నామ మలరు సుదక్షిణుం డనఁగను
ఫాలాక్షుఁ డయ్యెను [1]భాసురముగ
నచిరకాలము యౌవ నాశ్రితుం డగుచును
బాహు బల స్ఫూర్తిఁ బరఁగి మనుజ
పాలాగ్రగణ్యుఁడై భైరవుఁ బూజించి
యోగపాదుకలు చెనొన్నందఁ బడసి

గీ. అనుదినముఁ బుణ్య తీర్థ విహారుఁడగుచుఁ
దనర నొకనాఁడు నారద తపసి తత్పు
రంబునకు నరుగుదేర శుభంబుగాఁగ
నటులు పూజించె సంయమి నవని విభుఁడు. 25

చ. రయమున లేచి మ్రొక్కి యతి రమ్యతరంబుగ నర్ఘ్యపాద్య సం
చయము లొసంగి యోగ్య పరిచర్య లొనర్చిన మెచ్చి కౌతుకో
దయమున నారదుండును నుదాత్తత సర్వవిశేష తీర్థముల్
జయముగ సేవసేయుదువె సాగరమేఖల యందుఁ బార్థివా! 26

క. అని యడిగిన నన్నారద
మునివరు వీక్షించి పలికె ముకరంటెమహా
జనపతి యతిపావన మగు
ఘనపుణ్యస్థలము లెల్లఁ గనుఁగొందువుగా! 27

ఉ. పాత్రములైన విజ్జగతిఁ బాండవరంగము రంగము [2]న్నహీ
చ్ఛత్రపురంబు వందనము సల్పుదువా మునినాథ యున్నత

---

1. "ముగను చిరకాలము యవ్వనాశ్రయుండగుచు" చ. "యవ్వనాశ్రితుండగుచు"
2. క. చ. "రంగపటానహీ ఛత్రపురీశువందనము".

క్షేత్రయుగంబు నీకు నుప ఽ దేశముచేసియు నిప్పుడే నదే
యాత్ర లొనర్పనేఁగెద న ఽ రాధిప, నీవిటు లేగు మర్మిలిన్. 28

చ. అని యుపదేశమిచ్చి యు ర ఽ యంబుఁ నమ్ముని సేవ సంత న
జ్జనపతి యొక్కనాఁ డమర ఽ [1] శైవలిని స్నవగాహనార్థి యై
చనఁగ నదీనుఁడా నతని ఽ సన్నిధి నిల్చి తదీయపత్ని యి
ట్లనియె మహానుభావ, నిట ఽ లాత్మనృపాల కృపా నిరీక్షణా! 29

క. అని విష్ణుపదీనదిలో
వినుతంబుగఁ దీర్థ మాడి ఽ విశ్వేశ్వరునిఁ
గని సేవింపఁ దలంచిన
తన యభిలాషంబు చెప్పి ఽ తరళాక్షి వెసన్. 30

వ. కేలుదోయిఁ గీలించి వందనంబు గావించి యేను నితోఁ చనియెద నని హృత్కంటకంబు గాకుండ నమ్ముక్కంటీశ్వరుం బ్రార్థించి మఱియును. 31

క. మద్వాక్య మాదరింపుము
విద్వన్నుత, యనుచు వేఁడ ఽ విభుఁ డక్కాంతన్
హృద్విలస నోపగూహన
సద్విశ్వాసాతిరేఖ ఽ సహధర్మగతిన్. 32

వ. తద్దయు దయాళుండై యక్కాంతిమతీదేవి నుజ్జవంబుగా బుజ్జగించి గాఢాలింగనకుతూహలుఁడై. 33

గీ. కదలి పార్థివుండు ఽ కాంతసమేతంబు
గాను నిర్ఝరాప ఽ గాతటమున
కరిగి గంగయందు ఽ నవగాహనాసక్తి
దోహలమున నేగి ఽ తోఁగుచున్న. 34

క. అంతటఁ బులిన తలస్థిత
కాంతమణిస్థగితపాదు ఽ ద్వయ మపుడే
పంతంబుగ నతిమాయా
క్రాంతిని గంధర్వతసఖి ఽ రక్రియ నరిగెన్. 35

1. శైవలినీయవగాహనార్థి.

వ. అంత. 36

గీ. రాజవర్యుఁ డెలమి రామామణియుఁ దాను
[1] తానమాడి సైకత స్థలమున
కేగి యచటఁ గాల్య కృత్యంబు లాచరించి
కనుఁగొనంగఁ బాదుకాయుగంబు. 37

క. లేకున్నన్ మదిలోనన్
వ్యాకులతం జెంద నతని వరవర్ణిని యా
లోకించుట నీ వేటికిఁ
గాకుగ వగచెదవు స్వామి కలఁ డిల మనకున్. 37

క. మన దగు నపరాధము చే
తను మాయా కలితముగను దస్కరవృత్తి
న్ననువైన పాదుకాద్వయ
మును గొని వెసఁ జనిరి గాని మోసకు లకటా. 38

శా. దైవాధీనము లోకసంచయము మంత్రప్రక్రియాధీన మా
దేవవ్రాతము బ్రాహ్మణోత్తమగణాధీనంబు తన్మంత్రముల్
భావింపన్ ధరణీసురోత్తములు దేవధ్యేయు లవ్విప్రులన్
రావించిప్పుడు పూజసేయు మలరన్ రాజాన్వయ గ్రామణీ! 39

వ. వారలు భవదీయ కార్య నిర్వాహకానుగ్రహసమర్థు లగుదురు సంశయంబు లే దని యత్తన్వి యానతిచ్చిన విని శాంతస్వాంతుండై ధీవిశాలుండగు పృథివీపాలుండు స్నానానుష్ఠానగరిష్ఠులైన విప్రపుంగవులం గనుంగొని కాంతాసమేతంబుగాఁ దత్సమీపంబునకుం జని నమస్కారపూర్వకంబుగా ననేకవిధ వినయవాక్యంబులచేఁ బ్రసన్నహృదయులుగాఁ బ్రార్థించియుఁ దమ యుదంత మంతయుం దేటపఱిచిన నెఱింగి వ్యథామతి యగు నామహీపతి నిరీక్షించి యద్ధరామరవరేణ్యు లిట్లని యనునయించుచు. 40

1. క. చ. "స్నాన" "పాన"

క. నరవర, యికార్యము దు
ష్కరము మదీయాభిమంత్ర । సామర్థ్యమునం
బరికించి ప్రతివిధానముఁ
బరువడి నొనరింతు మయ్య । భవ్యముగాఁగన్. 41

వ. ఏమందఱము మున్నె నిమిదిదినంబుల క్రిందట నహిచ్ఛత్రపురంబునం గు
శ్రీవల్లభదేవుని సన్నిధి నీచేత నతియపచితి సత్కారంబులం బొందితిమి.
భవదీయ కార్యసిద్ధి కొఱకు నస్మదీయమహితవిహితధర్మక్రమంబుగా
నాభిచారికహోమక్రియాకలాపంబున భవత్ప్రియంబుఁ గావించెద మని
మఱియు నిట్లనిరి. 42

శా. గంగం దోఁగి యభంగురాంచిత తరంగ ప్రేంఖితోద్ధూత దో
స్తుంగాలింగితు లౌచు మే న్మఱచి సం । తుష్టాత్ములై నిల్చియ
భ్యంగస్నానమొనర్చుచున్నపు డమ । ర్త్య గ్రామవాస్తవ్య శ్రీ
భంగిన్ దొంగిలి రప్రశస్త కుటిలో । పాయ ప్రయత్నంబునన్. 43

గీ. అనుచు నూహించి సర్వథ । రామ కేంద్రు
లచట నఘమర్షణ స్నానమాచరించి
తనర హోమ మథర్వణో । క్త ప్రకార
మంత్రముల వేల్చి రగ్నిలో । మహితముగను. 44

వ. అంతటనప్పాటచ్చరుల నాహ్వాయాకర్షణంబు లొనరించిన నమ్మహాబలు
లరిగి పాదుకాద్వయంబు నొసంగిన నత్యంతసంతుష్టాంతరంగుండై యారాజ
పరమేశ్వరుం డవ్విప్రులం బూజించి వారితో నిట్లనియె. 45

క. మీరలు మాదేశమునకు
గారవమున నేగుదేరఁ । గనకమణిగణో
దారగ్రామము లొసఁగెద
దారసుతాసహితులై ముదంబుగ నెలమిన్. 46

క. రమ్మని యానతియిచ్చిన
నిమ్ముగ నున్నార మిచట । నీగంగా తీ

రమ్మన ముందఱ దుర్భి
క్షమ్మగు నపు డిచటు వాసి ǂ చనియెద మనఘా! 47

వ. కావున నీవు పాదుకాయోగంబున నహిచ్ఛత్రపురంబున కనుదినంబు వచ్చు
చుం బోవుచు మమ్ముం బరామర్శించి పోవలయు నని యాద్విజు లంద
ఱతిసౌఖ్యంబుగాఁ జనుటయు నానృపపుంగవుండు భార్యాసమేతంబుగాఁ
దన ధరణీవరణనగరంబునకుం జనిన. 48

ఉ. అంతటఁ గొంతకాలమున ǂ కయ్యమరాపగపొంతభూమి య
త్యంత మవృష్టిచేఁ గడు [1]భ ǂ యంకర మాచు మహాక్షుధా ర్తి భా
గ్జంతుసముచ్చయం బగుట ǂ సర్వధరామరులెల్ల వేదవే
దాంతవిచారపారగులు ǂ నై యుపశాంతిక హోమకృత్యముల్ 49

సీ. కావింప నుపశాంతి ǂ గా కున్న సాధ్వసో
ద్రేకులై యఖల భూ ǂ దేవగణము
లవనీతలేంద్రుఁడా ǂ నా సుదక్షిణురాక
కాకాంక్షులై యుండ ǂ నచట నొక్క
నాఁ డయ్యహిచ్ఛత్ర ǂ నామపురంబున
కరిగినవా ర్తయు ǂ నాలకించి
యేతెంచికాంచిన ǂ నెలమి నవ్విప్రుల
మన్నించి వేగ న ǂ మస్కరించి
పూజ లొనరింప దీవించి ǂ భూపవర్య
తీవ్రమున నేము మీ యాంధ్ర ǂ దేశమునకు
నరిగెద మటన్న ǂ నందఱ నాదరించి
గృహధనగ్రామధాన్య సం ǂ గ్రహము లెల్ల. 50

క. ఇచ్చెద రమ్మని పలికి వి
యచ్చరగతి గగనసరణి ǂ నరిగె నగరికిన్
జెచ్చెర నయ్యమరాపగ
పొచ్చిరి యార్వేలభూమి ǂ సుర లవలీలన్. 51

1. "భయంకర క్షు న్మహిమాప్రపీడితా జంతు". 49 మొదలు 95 పద్యములవఱకుఁగల భాగము 'క' ప్రతిలో లేదు. 'చ' ప్రతినుండి గ్రహింపఁబడినది.

సీ. స్నాతులై శౌచ ని ॥ ష్ణాతులై శ్రీరమా
వల్లభస్వామికి ॥ వందనములు
గావించి పరదేశ ॥ గమనాభిలాషులై
చననున్న వారల ॥ చరణవిహృతి
గతినిరుద్ధంబైన ॥ మతి నద్భుతం బంది
తడవు వితర్కించి ॥ దైవమాయ
యని తోఁచి యంత జ ॥ నార్దనస్వామిని
బ్రణుతించి యిదియేమి ॥ బాధ మాకు
నీ మహాక్షామ భయమున ॥ కేము వెఱచి
యేఁగఁబూనుచు నున్నార ॥ మిపుడు నిన్ను
విడిచి దేశాంతరం బని ॥ విన్నవింప
వారిజాక్షుండు వలికెను ॥ వారితోడ. 52

శా. పారాశర్యుఁడు శిష్యసంఘయుతుఁడై ॥ భాగీరథిం గ్రుంకి యా
వారాణస్యురుపట్టణాలయములన్ ॥ వర్తించి భిక్షాన్నముం
గోరన్ లే దని రప్పురంధ్రులు మహా ॥ కోపంబుతో జాహ్నవీ
తీరోర్వీతలజంతువుల్ విపుల తు ॥ త్పీడాకులత్వంబునన్. 53

క. శాపం బిచ్చినకతమున
నీపగిది నవృష్టి యయ్యె ॥ నిది వాపంగా
నోపను మిముఁ బోషించుక
నేపైన సహింపఁ జాల ॥ సిద్ధం బిచటన్. 54

క. అదిగాన నిచట నిలువఁగ
మదికిన్ రుచియింపకుండు ॥ మద్వాంఛిత మీ
యదనున మీతోడన చని
ముద మలర వసింతు నచట ॥ మున్నుగ మీరల్. 55

గీ. చనిన పిమ్మటఁ బరివార ॥ జనముతోడ
యోగమాయాబలంబున ॥ నేఁగి యచటి

హాస్యముగ మీకు నత్యంత § హర్షముగను
బ్రహ్మకుండీతరంగిణీ § పారమందు. 56

క. ఆదేశంబున నొకచో
మేదిని వసియించి నిర్గ § మించియు జనసం
మ్మోదంబుగ దృగ్గోచర
మాదు మదిష్టంబు వచ్చి § నప్పుడు జగతిన్. 57

వ. అని యివ్విధంబున శ్రీ వల్లభుం డానతిచ్చిన విని సంతుష్టహృదయులై భవదభిమతం బెవ్విధంబున నుండు నట్లు యగుంగాక యని తద్దేవు నుద్దేశించి యత్యంతభక్తియుక్తులై దండప్రణామంబు లాచరించి బ్రహ్మవాదులైన బాడబానీకంబు లనుజ్ఞవడసి. 58

చ. కదలి కుటుంబసంయుతము § గాఁ జని కొన్ని మహాప్రయాణముల్
ముద మలరంగ నేఁగి నృప § ముఖ్యుని పట్టణమందు నిల్చినన్
ఎదురుగ నేఁగుదెంచి పృథి § వీశుఁడు వారలఁ దోడితెచ్చి నె
మ్మదిఁ దనమందిరంబున స § మర్చ లొనర్చి సుభోజనంబులన్. 59

గీ. ఆదరించి వారి కాగార § ధనధాన్య
రత్ననివహావాజి § రాజి గ్రామ
భూము లొసఁగి వారిఁ § బోషింపుచుండెను
నక్షయముగ నాసు § దక్షిణుండు. 60

శ్రీ వల్లభుఁడు కారవేల్ల కాలవాలమునఁ జేరియుండుట.

క. శ్రీవల్లభదేవుండును
పావన పరివారసుజన § పరివృతుఁడై తగ్
భూవివరంబున సురసం
భావితుఁడై నిలువ నొకట § పట్టున నంతన్. 61

సీ. అట విప్రుఁ డామీఁద § నవనీతలంబున
వాలయముగఁగా ర § వల్ల కాల

వాలంబువెట్టియు | వారి పూరం బిడి
వావిరిఁ బోషింప | వలసినట్లు
ప్రసృమరసుశలాటు | ప్రచయ సమృద్ధిగా
సరససంపన్నమై | పరగుచున్న
ననుదిన మాకాయ లంగళ్ళ | నమ్మించి
కార్యనిర్ముక్తుఁడై | ఘనత నలరె

పుత్త్రపౌత్త్రానురక్తుఁడై | భూషణ ప్ర
భూషితాకార భార్యాభి | లాషసౌఖ్య
కారి యయ్యు శచీపతి | కరణిఁ దనర
భూసురేంద్రుఁడు సంపద్వి | భాసియగుచు. 62

చ. అకలుషభవ్యమూర్తి మణి | హార సముజ్జ్వలుఁడై ధరామర
ప్రకరము గొల్వనేఁగి యొక | పట్టున శాంబరియుఙ్ వహించి యా
సకలజగన్నియామకుఁడు | సాగరమేఖల నుండఁ గారవే
ల్లకలతికాలవాలబహు | లాభ సుఖస్థతుఁ డయ్యె నయ్యెడన్. 63

అనంతపాలుని జన్మ వృత్తాంతము.

చ. అల కలి కాదికాల మఖి | లా వనిభర్త కళింగవంగకో
తకేరళముఖరాజ్యభారుఁడతి | ధార్మికుఁ డద్భుతవిక్రమక్రియా
కలితుఁ డనంగ భీమజన | కాంతుఁ డిలం గటకాఖ్యపూ ర్వరం
బలవడ రాజనిధానిగ శు | భాతిశయంబుగ నేలుచున్నెడన్. 64

వ. అట్టికాలంబున నిఖిలవేదవేదాంత విచక్షణుండును కృష్ణాసరిత్తీర వాసుండును
నైన మాధవుం డనునొక్కధరామరవరుండు గంగాయాత్రాభిలాష
కుతూహలుం డగుటయుఙ్ సహధర్మచారిణియైన సతి పతి నవలోకించి. 65

శా. అంతర్వత్నియునైన పత్ని దనవ | ర్త్మాయాస మూహింపక
కాంతుఙ్ శాంతవచః ప్రసన్న మలరఙ్ | గంగావగాహంబు నీ
చెంతం జేయఁగ వత్తు నే ననిన హ | ర్షించెం గటాక్షించి స
ర్వాంతర్యామియునైన దైవఘటనా | యత్తప్రయత్నంబునన్. 66

క. అంగీకరించి భార్యా
సాంగత్య విశేషయాత్రఁ జను చుత్కళవం
గాంగ కళింగ కుళింగము
లుం గడచి బహుప్రయాణ లోలాత్మకులై. 67

వ. ఇవ్విధంబున సద్ధరామరమిథునంబు పథికపరివారానుచరులై పోవంబోవ నట ముందట. 68

చ. అనిశము పుండరీకనఖ రాయుధకోలతరక్షుబుక్షకా
ననగజ కాస రాఖు హరి ణంబుల కాశ్రయమైన దండకా
వనపదమధ్యసీమ నని వారితమా జననవ్యథార్తయై
కనియెఁ గుమారు భూసురుని గాంతయుఁ గాంతశరీరధారునిన్. 69

వ. అంత దైవజ్ఞప్రజ్ఞాభిజ్ఞుండైన తజ్జనకుం డనుకూల కాలచర్యావిచక్షణుండై. 70

మ. గ్రహసమ్యక్స్థితలగ్నతారతిథి వా రప్రాప్తియోగంబులన్
బహిరంతర్యుత భాగ్యరేఖల సు పర్వాధీశసంకాశుఁ డీ
మహిఁ బాలించు నృపాలమాన్య తరసా మ్రాజ్యర్ధిఁ డస్మత్కులో
ద్భవుఁడౌటన్ బహువేదశాస్త్రపరిల బ్ధజ్ఞానయుక్తుం డగున్. 71

వ. అని నిశ్చయించి 72

క. యాత్రయు విఫలం బగు నీ
పుత్రవ్యామోహ మేమి పుణ్యం బితఁడీ
ధాత్రీపాలన కర్హుఁడు
శ్రోత్రియ రక్షకుఁడు గాత్ర సూచన లరయన్. 73

వ. అని నిస్సంశయంబున 74

మ. దళసంకీర్ణ విశాలశాఖల నితాం తం బైన భూజంబుక్రిం
ద లసత్పల్లవపత్రశయ్య నొగి సం స్థాపించి దీవించి ర

తులు బంధించి ధరాదిభూతచయ దిక్పాలాభిధేయంబు చె
న్నలరన్ వేఁడి తదీయడింభకు భవిష్యద్భాగ్యభావంబులన్. 75

క. తాళీదళమందున నవ
లీలన్ గోత్రాన్వయా వళీనామము లా
మూలాగ్రముగ లిఖించియు
బాలుని పదకమల మందు బంధించి వెసన్. 76

వ. మమత్వరహితుండై యాత్రాపరత్వమునం గుటుంబినీయుతుండై చన
నక్కడ. 77

మ. తలిదండ్రుల్ దిగనాడిపోవ నచటన్ దైవానుకూల్యంబుచే
నలఘువ్యాళవిభోగశీతల కృతాత్యంతోల్లసచ్ఛాయచే
దళసంకీర్ణలసద్ద్రుమాగ్ర మధు విస్తారస్రవస్వీకృతం
బలరన్ జీవితుఁ డౌచు నచ్చట నపాయం బేమియుం జెందకన్ 78

వ. ఇవ్విధంబున ధరణీసురడింభకుం డున్న సమయంబున నిజపరివారపరి
వృతుండై 79

ఉ. వేఁటనెపంబుచేత పృథివీవరుఁడైన యనంగభీముఁ డ
చ్చోటికి నేఁగి యర్భకునిఁ జూచియు నివ్వెఱగంది యేమి యి
ట్లాటకుఁగారణం బని దయాకులమానసుఁ డౌచు డాసియున్
దేటపడం గనుంగొన నదృశ్యత నొంద ఫణీంద్రుఁ డచ్చటన్. 80

ఉ. చేరువ కేఁగి రాజు పరిశీలన చేసితదీయపాద బ
ద్ధోరువిలేఖ్యవర్ణమపు డొయ్యన విచ్చి పఠించి యామహా
దారు నుదంత మంత విదితంబగుటన్ మది నుత్సహించి భా
పారమణీశవంశ్యు మృదుశైశవ సక్తుని దెచ్చి నెమ్మితోన్. 81

గీ. తనగృహంబున నిల్పి తద్బాలవృత్త
మంతయును దేటపఱచి సుస్వాంతుఁ డగుచుఁ
బోషణముచేసి యాదరసుపుత్రుభంగి
నా ద్విజుఁ డనంతపాలితుఁ డగుటఁ జేసి. 82

అనంతపాలుఁడు దండపాలుఁడై కాంచికైకి దాడి వెడలుట.

చ. అతని కనంతపాలుఁ డను । నాహ్వయమున్ రచియించి సర్వస
మ్మతముగఁ బెంప నాతఁ డతి । మానుషరూపకళాభివృద్ధిమై
శతమఖసూతివోలె రణ । సాహసలీలల నొప్పఁ జూచి భూ
పతి యుపనీతికాల మని । పన్నుగ నాదిమశాఖవిప్రుఁడై. 83

క. పరగిన మాధవశర్మకుఁ
బరమపతివ్రతయునైన । భాగీరథికిన్
శరజన్మకరణిఁ గానన
సరణిం జనియించెఁ బ్రథమ । శాఖ నలవడన్. 84

సీ. కావింపవలయును । గా ఘంబుగా నని
రావించి యఖిల భూ । దేవసమితి
కాబాలువృత్తాంత । మంతయు నెఱిఁగించి
యాదిమశాఖాస । మంచితముగ
వారిగోత్రంబున । వడుఁ గొనరించియు
విప్రసమ్మతముగ । వేదశాస్త్ర
విద్యలు చదివించి । వివిధసాధనముల
గరగరియగునట్లు । గా నొనర్చి
తనతనూజ నృసింహాభి । ధానుతోడఁ
గూడ నవ్విప్రసూతికిఁ । గూర్మి మిగుల
నుద్వాహముచేసి కౌతుకో । ద్యుక్తుఁ డగుచు
ఘనత నలరంగఁ గతిపయ । కాలమునకు. 85

గీ. ఆ యనంగభీము । డంతజరాక్రాంత
దేహుఁడై కుమార । మోహుఁ డగుచు
నారసుండునైన । నారసింహునకుఁ ద
ద్రాజ్య మొసఁగి తనదు । తనయకరణి. 86

క. రక్షించిన సుకుమారవి
చక్షున కాన్వీక్షకీవి । శారదగుణసం

ధుత్తున కనంతపాలున
కత్షయముగ నొసఁగె సైని ఽ కాధ్యక్షతయున్. 87

వ. అదికారణంబుగా దండపాలుం డనంబరగె. 88

క. సేనాపతియై విష్వ
క్సేనునిక్రియ శివతనూజు ఽ సేనానిగతిన్
దా సరివర్గజయోన్నతి
నానరసింహునకు ఘనప ఽ రాక్రమ మెసఁగన్. 89

వ. సత్యవ్రతప్రతిజ్ఞుండగు నృసింహభూతలేశ్వరుండు సైన్యాధిపతి సామర్థ్యంబునంజేసి యత్యంతవిక్రమాన్వితుండై ప్రత్యర్థిపార్థివవర్గనిర్వాపణసమర్థుండై నిరంతరబ్రాహ్మణపోషణైక తత్పరుండై సకలప్రజానందకరంబుగా సమస్తమేదినీపాలనం బొనరింపుచు నొక్కనాఁడు దనయనుజుం డనం బరగిన దండనాథాగ్రణిం గనుంగొని, మహోల్లాసంబుగ నిట్లనియె. 90

గీ. సకలజనులుపొగడ ఽ సత్యవ్రతాహ్వయ
పుణ్యనగరమందు ఽ భూరిమహిమఁ
గరిగిరీంద్ర మలరు ఽ కమనీయసానువై
పరనృపాలజైత్ర ఽ పటిమఁ దనరి. 91

క. మనలో నెవ్వ రమైనను
(జని) విజిగీషాంక లిఖిత ఽ శాసన మట సం
తనముగ సంస్థాపించిన
మనమునకును హర్షమగు న ఽ మాత్యవరేణ్యా. 92

చ. అన విని దండపాలుఁ డపు ఽ డా సభవారలు మెచ్చునట్లుగా
జనవర యీప్రయోజనము ఽ శక్యము నా కటుగాన సౌఖ్యస
ద్ధనముగ మేదినీభరముఁ ఽ దాలిచి దిగ్విజయంబుగాఁ జనం
జను జగదేకవీరరణ ఽ సాహస విక్రమలీల నీ కిలన్. 93

వ. అయినను. 94

మ. భవదీయాజ్ఞ వహించి యేను జనిగర్వగ్రస్తులైనట్టి శా
త్రవులం గెల్చియు హస్తిశైలమున సంస్థాపించెదం మేదినీ
ధవజైవాతృక తావకాధిక జయస్తంభంబు నుద్యన్మహా
హవకృత్సైన్యయుతంబుగా నరిగెదం హర్షాతిరేకంబునన్. 95

వ. అని మఱియును. 96

మ. సరణిం బుణ్యనదీనదంబులు సురస్థానంబులుం భూరి భూ
సురవారంబు లనేకముల్ గజపురక్ష్మోణీశ యాభూములం
మఱి దానాది తటాకకూప వన ధర్మస్థాపనంబుల్ పొరిం
బొరిఁ గావింపఁ బదార్థ సద్వ్యయ మగుం పుణ్యం బగణ్యంబుగన్. 97

గీ. అక్కడక్కడ నీకీర్తి యతిశయిల్లఁ
జేసి వచ్చెద ననవుడుఁ జిత్తగించి
దండితారాతియైన వే దండపతియు
లాలన ననంతదండ పాలకునితోడ. 98

క. పలికెను మన యిరువురిలో
పల భేద మొకింత లేదు పరికింపంగా
నలఘుభుజ నీవె నే నని
తలఁచెద సంశయము మాని తడయక నింకన్. 99

క. చతురంగ సైన్య యుతముగ
హితమంత్రి సమేతముగ యథేచ్ఛం జనుమా
పృతనాపతి యనుచును భూ
పతి యానతియిచ్చె వేగ భాసురలీలన్. 100

ఉ. పంప ననంతదండపరిపాలకుఁ డచ్చతురంగసేన శో
భింపఁగ శత్రుభీకరగభీరధమామిక వీరకాహళుల్

సొంపుగ మ్రోయఁగా సమర శూరజయధ్వను లుల్లసిల్లఁగాఁ
బెంపుగ వందిమాగధులు పెక్కువిధంబుల సన్నుతింపఁగాన్. 101

వ. ఇవ్విధంబున నిఖిలసేనాపరివృతుండై ధనదుక్రియ ననుకరించి మహో
న్నతంబుగాఁ గదిలి చని యెడనెడ మార్గమధ్యంబునం గల పుణ్యక్షేత్రం
బుల సురాలయనికర [1]నిర్మాణ ద్విజస్థాపనాది ధర్మంబు లొనరించుచుం జని
శ్రీకూర్మనాయకు నారాధించి యచటు గదిలి సింహాచలంబున కఱిగి తద్దే
వున కతిభక్తి నతియుపచితివిధానంబు లాచరించి యనంతరంబ గోదావరీ
తటంబున కరిగి యానది నవగాహనానుష్ఠానంబులు దీర్చి ప్రసన్నమన
స్కుండై ధరామర నికరంబునకుం గోరిన యట్ల ధేనుధనవసుంధరా ద్యపరి
మిత విశేష విహాయితంబు లొనరించి గౌతమీస్రవంతి నుత్తరించి. 102

మహాస్రగ్ధర.-చని యాదుర్వారసేనాసమితి గొలువఁగా సాహసోద్రేకలీలన్
ఘన భేరీ ఢాండఢాండోత్కరరవ మడరన్ గాహళుల్ మ్రోయుచుండన్
వినుతిం గైవారికుల్ దిగ్విజయముఁ బొగడన్ విప్రు లాశీర్వదింపన్
గనియెన్ శ్రీసహ్యజా భూకలుషహరసరిత్ కంధికాంతాగ్రగణ్యన్. 103

గీ. తేరి చూచి [2]యసికినయాతీరమందుఁ
గాకుళక్షేత్రతలమున ఘనత మెఱయ
నఖిలసేనాప్రవాహ సమన్వితముగ
విడిసె గజరాజయువరాజు విభవ మలర ! 104

అనంతపాలుఁడు శ్రీకాకుళమునఁ దన తల్లిదండ్రులను గుర్తించుట.

శా. ఆ కృష్ణానదియందు సద్ద్విజుల తో నత్యంత సంతుష్టుఁడై
సాకల్యాతిశయాఘమర్షణ చణ స్నానాద్యనుష్ఠాన మ
స్తోక ప్రౌఢి నొనర్చి విప్రులకు నౌత్సుక్యంబుగా దానముల్
సౌకర్యంబుగఁ జేసి యంశుకచతుశ్శాలస్థలిం జెందియున్. 105

క. ఆసీనుఁడై సుఖంబుగ
నాసీరమునందు నుండి నయముగ మది ను
ల్లాసముగ మున్ను జనకుఁడు
వ్రాసిన యా[3]క్షేత్ర లిపి సవర్ణముగాఁగన్. 106

1. క. సింగణ. 2. చ. యసికినితీర. అసికినయాఽకృష్ణా. 3. చ. ‘పత్ర’.

గీ. తోఁచినను దల్లి దండ్రులఁ జూచువేడ్క
నెమ్మనంబునఁ జింతించె నేర్పు మిగుల
వారు జీవింతురేని మ ద్భాగ్యవశతఁ
బెంపు దీపింప నిపుడు ద ర్శింపఁగలుగు. 107

మ. అని యీభంగిని వారిఁ గోరి మరునాఁ డభ్యాశమందున్న స
ర్వనర గ్రామనివాసభూసురుల సం భావించి వేర్వేఱఁ ద
జ్జననాఖ్యాప్రవరాభిగోత్రతతిశ శ్వత్పృచ్ఛఁ గావించి పూ
జనముల్ సేయుచు నొయ్య నొయ్య నరయున్ సమ్యగ్విధానంబునన్.

వ. ఇవ్విధంబున నమస్కృతు లొనర్చుచుం జని జనకునిం గదిసి యన్వయగోత్ర నామంబు లడుగం దత్పత్రలిపిప్రకారంబున సర్వంబును నెఱింగించినం దెలియ విని సంతుష్టాంతరంగుండై యతని నారాధించి యంతట సమస్త ద్విజులకు ననుజ్ఞ యొసంగి యాతని నుండ నియమించి తన సమీపమందు మున్ను లిఖియించి యునిచికొనిన తాళపత్రంబు విప్రున కొసంగినం గనుంగొని మాధవుం డతిమోదంబునఁ బురాతనవృత్తాంతంబు మనంబునకు జ్ఞప్తియగుటయుం బుత్త్రు వెస నిరీక్షించి యీ వృత్తాంతం బంతయుఁ దొల్లి పంచవింశతివత్సరంబుల క్రిందట నావిర్భవించిన మత్తనయుం దండకారణ్యంబున నునిచి యొక్క పర్ణంబున సౌవర్ణంబుగా లిఖియించి యా శిశుచరణంబునం బంధించితి. ఇప్పుడు మగిడి మీ సన్నిధిం గనుంగొంటి. నా తనయుం డెచట వర్తించునో, యిది భవదీయ సమీపంబున కెట్లు వచ్చె నానతీవలయు నని యడుగుటయు నాదండనాథుండు. 109

క. తన వృత్తాంత మశేషము
వినయంబునఁ దేట పఱచి పితృచరణయుగం
బున కెఱఁగ నతఁడు పెన్నిధిఁ
గనువేద తెఱంగునన్ సుఖప్రియ మలరన్. 110

క. పరిరంభ మాచరించియు
శిర మాఘ్రాణంబు చేసి చేతోజాత

స్ఫురణుఁ డగు దండపాలుని
వెర వారఁగ గారవించి § వేడుకతోడన్. 111

వ. ఇక్కార్యము మనమిరువుర మెఱుంగుటయ కాని బహిఃప్రకాశంబు సేయ వలదు. యుష్మన్మాత భాగీరథి. ఏను మీజనకుండను. మద్వంశోద్వాహ పూర్వాపరతరంబుల వారిం దరియింపం జేయఁదగుదువు. సంశయంబు లేదు. కావున నిచట చతురంగసైన్యయుతంబుగా నిలువు మని పలికి మాధవుం డతిత్వరితగమనంబున భవనంబునకుం జని తద్వృత్తాంతం బెఱింగించి మఱునాఁ డరుణోదయంబునం గుటుంబినీయుతంబుగాఁ గాకుళంబునకేతెంచి పుత్త్రునిం గనుంగొనుటయు. 112

గీ. అంత దండపాలుఁ § డాతలిదండ్రుల
నర్ఘ్యపాద్యవిధుల § నాదరించి
పూజ లొనరఁ జేసి § భూషణాంశుకచయ
కనకరత్నరజత § గణములెల్ల. 113

క. చేతోమోదంబుగ నిడి
మాతా పితృసహితుఁ డగుచు § మహిమ దలిర్పన్
బ్రీతిగ విప్రులఁ బ్రోచుచు
నాతఁడె బహువాసరంబు § లచట నిలిచియున్. 114

వటురూపియైన శ్రీ వల్లభదేవుఁ డనంతపాలుని వలన భూదానము ప్రతిగ్రహించుట.

వ. శ్రీకాకుళేశ్వరుమాహాత్మ్యం బంతయు విని విస్మయానంద హృదయుండయి తత్ప్రదేశంబున దివ్యప్రతిష్ఠ విధ్యుక్తప్రకారంబుగా నొనరించుటకు గృహక్షేత్రాదివసతు లొసంగి, ద్విజవరుల నిలుపుటకు నిర్ణయించి భగవద్విగ్రహాన్వేషణం బొనరింపుచు బ్రాహ్మణగవేషణపరత్వంబున శ్రోత్రియ పరీక్షా ప్రవణుండై యున్న సమయంబునఁ బూర్వోక్తకార వెల్లాలవాల ధరణీబిలాంతర్వర్తి యగు లక్ష్మీవిభుండు. 115

సీ. అజినోత్తరీయ స § మ్యగ్దండ కౌపీన
ధారియై వామనా § కార మమర
నూతన వికచకంజాత సునేత్రుఁడై
సకల సులక్షణా § ధికతఁ దనరఁ

జారు ద్విజబ్రహ్మ ऽ చారిరూపముఁదాల్చి
హారినీలసదృశ సం ऽ హనన మమరఁ
గందర్పకోటి సం ऽ కాశ ప్రకాశంబు
గా సభాస్థలి కతి ऽ కాంతి యొసఁగఁ
జని కదిసి దండనాథునిఁ ऽ గని ముదమున
సేమ మగుఁగాక యంచు నా ऽ శీర్వదించి
పలికె నిట్లని సువ్యక్త ऽ వచన రచన
లలరఁ బురుషోత్తముఁడు మహా ऽ హ్లాదుఁ డగుచు. 116

ఉ. క్షేత్రముఁ గోరి వస్తి నృప ऽ శేఖర కశ్యపగోత్రుఁడఁ ఫణి
చ్ఛత్రపురాధివాసుఁడ వి ऽ శాలపవిత్రయజుర్వి శేష స
త్సూత్రుఁడ దానపాత్రుఁడ జ ऽ తుర్దశవిద్యలయందుఁ జైత్రుఁడఁ
శ్రోత్రియుఁడఁ బరిగ్రహ క ऽ రుండను వల్లభనామధేయుఁడన్. 117

క. దాతవు నీవు పరిగ్రహ
పూతాత్ముఁడ నేను సుకృతమున విద్యా సం
జాతపరీక్ష యొనర్పఁ
శ్రోత్రవ్రాతంబులోఁ బ్ర ऽ శస్తం బలరన్. 118

క. పాత్రుఁడ నని తోఁచిన నీ
ధాత్రిని గృష్ణాభిధాన ऽ తటినీతటి సు
క్షేత్ర మొసంగుము విమనస
సూత్రాగమపాంచరాత్ర ऽ శుభసంవిత్తిన్. 119

క. ఈ విధమున సువ్యక్తము
గా వచియింపంగ వటునిఁగని మూర్ఛింపన్
బోవక చిత్తరుహూపుల
భావంబున సభికు లెల్లఁ ऽ బలుకకయున్నన్. 120

గీ. అంత దండ పాలుఁ ऽ డా సభాసదులును
జోద్యమందుచున్నఁ ऽ జూచి పలికె

ధీరవర్యులార ! ౹ మీర లీబాలునిఁ
జేరి సత్పరీక్ష ౹ చేయరేమి ? 121

వ. అని యడిగిన. 122

క. వారు నృపప్రేరితు లయి
చారుతరోదార నిగమ ౹ శాస్త్రాగమ స
త్పారా ణామ్నాయాంత వి
చారిత రాద్ధాంత సరణిఁ ౹ జర్చించి మరిన్. 123

సీ. తర్క-మీమాంసా[1]వి ౹ తర్క ప్రవీణులు
సర్వేతి హాస ప్ర ౹ శంసకరులు
లలిఁగావ్య నాటకా ౹ లంకార పారగుల్
భాట్ట ప్రభాకర ౹ ప్రవణమతులు
వైశేషికాగమా ౹ వేశవిజ్ఞానులు
పాతంజలికశా స్త్ర ౹ ఫక్కి-చణులు
వేదవేదాంత [2]ప్ర ౹ వృత్తులు నానార్థ
దర్శనగ్రంథ సం ౹ దర్భపరులు
వివిధ భంగులు ఘర్షించి ౹ విప్రుఁ డని ప
రీక్షచేయుచు లోక సంరక్షకునకు
యుక్తు లిడలేక ప్రాజ్ఞు ల ౹ శక్తు లగుచు
హర్షముగ దండపాలుతో ౹ ననిరి యపుడు. 124

ఉ. బాలుఁడు గాఁ డితండు నర ౹ పాలక లోకము లెల్ల నేలఁగాఁ
జాలిన సర్వ భవ్యగుణ ౹ జాలసమగ్రుఁడు నిందిరామనో
లోలుఁడు మర్త్యరూపమున ౹ లోకమునం జరియించువాఁడు గాఁ
బోలును గాకయున్న మముఁ ౹ బొంకములెతోను జయింప శక్యమే ? 125

ఉ. ద్వాదశవర్షవిప్రపటు ౹ వామనరూపసరంగిఁ దాల్చి యీ
మేదిని సుందరోన్నతి స ౹ మేతముగా సుకుమారమూర్తియై

1. క. ‘సాఖిలశాస్త్ర ప్ర’. 2. క. ‘ప్రవర్తక’. 3. చ. ము గాఁగ.

వేదచయప్రశాస్త్రముల ఽ వెర్వక తజ్ఞుల ధిక్కరింపుచున్
నీదగు భాగ్య సంపద గ ఽ ణింప రమావిభుఁ డీనెపంబునన్. 126

గీ. వచ్చినాఁడుగాన ఽ వసుమతీశవరేణ్య
యితనికాంక్ష యరసి ఽ యి మ్మటంచు
విప్రవరులు పలుక ఽ విని దండపాలుండు
హర్షవినయ యుక్తుఁ ఽ డగుచు నగుచు. 127

ఉ. చక్కనిముద్దుబాలుఁ గని ఽ సంతసమందుచుఁ దత్ప్రభావమున్
మిక్కుటమౌటెఱింగియు స ఽ మీహిత మెయ్యది కోర్కె యెద్ది నీ
వెక్కడనుంచి వచ్చెద వ ఽ హీనవిహాయత మొప్ప నీకు నే
మక్కువతో నొసంగెదను ఽ మాణవకోత్తమ యానతి మ్మొగిన్. 128

గీ. అనిన దండపాలు ఽ నాలోకనముచేసి
పలికె భాసురముగ ఽ బ్రహ్మచారి
యాసభాజనంబు ఽ లాహ్లాదులై తనుఁ
జూచుచుండ నపుడు ఽ చోద్యముగను. 129

ఉ. ధాత్రిని విష్ణుపాదజని ఽ తాతటభూతలమందు నయ్యహి
చ్ఛత్రపురంబు వాసి చని ఽ శంకరపాలితబ్రహ్మకుండికా
క్షేత్రసమాశ్రయంబున వ ఽ సించితి నచ్చట ద్వాదశాబ్దముల్
చిత్రముగాను జర్గె నర ఽ సింహనృపాలకమంత్రిపుంగవా ! 130

గీ. అచట నుంచి వస్తి ఽ ననఘ శ్రీకాకుళ
క్షేత్రమందు నిలుచు ఽ చిత్తవృత్తి
గలదు గాన నీదు ఽ ఘనకీర్తి విలసిల్ల
విశదముగను వృత్తి ఽ దశక మిచట. 131

క. ఇమ్మని యానతి యిచ్చిన
నమ్మహి నాదండపాలుఁ ఽ డానందముతో
నెమ్మదిఁ దద్ద్విజ సన్నిధిఁ
గొమ్మని యవ్విప్రవటుని ఽ కుడికేల వెసన్. 132

గీ. వారిపూర్వకముగ । ధారవోయఁ గరస్థ
జల మొసంగునపుడు । సలలితముగ
నానతిచ్చు మనవి । నంగీకరింపుచుఁ
దజ్జ్ఞ లెల్లఁ గాంచి । తను నుతింప. 133

శా. ధాత్రీవృత్తిదశాత్మకం భువి(చ)తే । దత్తంవిభో పుత్రసత్
పౌత్రానీక పరంపరాన్వయభవ । త్సౌఖ్యాభిభోక్తవ్య మర్
సూత్రంబుల్ వచియించి యంచిత మనః । స్ఫూర్తిన్ దదీయోల్లస
త్పాత్రంబైన రమాధినాథునకు శ్ర । ద్ధాభక్తియుక్తంబుగన్. 134

వ. ఇవ్విధంబునం బలికి యుదక పూర్వకంబుగ. 135

ఉ. దాన మొసంగి భూసురవి । తానము లెల్లను భక్తి నప్పుడుర్
రా నియమించ నత్తఱిఁ జి । రాలున వా రవగాహనాద్యను
ష్ఠాన మొనర్ప నేఁగ వటు । సత్తముఁ బ్రార్థనచేయ వత్తు నం
చా నృపుచే ననుజ్ఞగొని । యంచితరూపప్రమోహకారియై. 136

వ. అని యానతిచ్చిన. 137

క. వలనూ గని రోమహర్షణి
పలుకులు విని శౌనకాది । పరమమును లటా
వలి వృత్తాంత మశేషము
తెలియఁగ వినిపింపు మన ను । దీర్ణప్రౌఢిన్. 138

మ. దివిషల్లోకవిధేయలోకచయ సం । దీప్త[1]ప్రభావా రమా
ధవ రాజర్షివరేణ్యపూజిత సమ । స్తప్రాణిసంత్రాణకే
శవ దుర్గాధిప సత్సహాయతర కృ । ష్ణాపూర్వతీరోల్లస
ద్వ్యవసాభ్యంతరభాసమానమణిము । క్తాహార శార్ఙ్గాయుధా! 139

క. నతజన కల్పానోకహా
పతగేంద్ర తురంగ దాసభవభంగ శత

1. క. 'ప్రదుండార'.

క్రతు సన్నుతపదయుగ మ
త్కృతపుణ్యనికాయకథిత ॥ కేశవరాయా ! 140

తోటకవృత్తము.—కరుణాకర శ్రీకర ॥ కాకుళమం
దిరభాసుర సుస్థిర ॥ దేహహరి
స్మరవైరినుతా మర ॥ పాలక భా
స్కరధామతిరస్కర ॥ చక్రధరా. 141

గద్య. ఇది శ్రీమత్తిరుమల తాతగురుగురుచరణారుణాబ్జయుగళసమాశ్రయణ దురితలతాలవిత్ర హారితసగోత్రపవిత్ర భట్లపెనుమర్తికులోద్భవ గోపాలసచివతనూద్భవ విద్వజ్జనవినుతాభిరామ కోదండరామ ప్రణీతం బయిన బ్రహ్మాండ పురాణోత్తరఖండంబున వల్లభాభ్యుదయం బనెడి శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యంబునందుఁ దృతీయాశ్వాసము.

---

# వల్లభాభ్యుదయము

## చతుర్థాశ్వాసము



క. శ్రీకర దివిజానీక వ
శీకర కరవేల్ల శరణ శేఖరమహితా
లోకసమాగత విలస
తాటకుళసదనప్రదేశ కమలాధీశా! 1

గీ. హర్షముగ రామ హర్షణి యాన[1]తీయఁ
దొడఁగి యాశౌన కాదుల తోడఁ జెప్పె
నపుడు నృపపుంగవు ననుజ్ఞ నరిగినట్టి
విప్రనికరంబు భోజన వేళఁ దెలిసి. 2

చ. వచ్చినవారిఁ గాంచి జన వల్లభుఁ డల్లవటుండు లేఁ డతం
డెచ్చట నున్నవాఁ డనిన నెవ్వర మాతనిఁ జూడలే దనన్
జెచ్చెర విస్మితుం డగుచు శీఘ్రముగాఁ దమవారిఁగొందఱం
బుచ్చుచు మాటిమాటికి న పూర్వముగా నరు దందుచున్ మదిన్. 3

గీ. ఎదురుచూచుచుండ నెలమి నయ్యరుణగ
భస్తి పశ్చిమాబ్ధిఁ బరఁగఁ జేరె
శరధిశయనుఁ డయిన శౌరి కచ్చటివార్త
లెఱుకపఱచుకొఱకు నేఁగుకరణి. 4

ఉ. ఆరవి[2] చేర విచ్చేఁ జర మాచలకూటతటిన్ సురక్తిగం
పారఁ బయోనిధిన్ వరుణుఁ డర్మిలి భర్మమయంపు జంపుఁగై
వారపుఁ బద్మరాగమణి వన్మహనీయపతాక నిల్పెనో
వారిజనాభుపజ్జ నన వావిరి విస్మయరశ్మిరమ్యమై. 5

---

1. క. చ. తివ్య. 2. చ. కోర.

గీ. అంత దిక్కులఁ జీఁకటు • లతిశయిల్లెఁ
బరమ పద నాయకుని దివ్య • భవనమందు
సంకుమద మిశ్ర కస్తూరి • పంక మలరఁ
బూఁత వెట్టిన మేచక • స్ఫూర్తు లనఁగ. 6

ఉ. ఆ పరమేశ్వరాశ్రయమ • హాలయమంటప గోపురోపరిం
బ్రాపుల వప్రకుడ్యతల • రాజిత గేహములందు నిందుకాం
తోపల పద్మరాగతతి • నొప్పుగ వేల్పు లనేకదీపికా
రోప మొనర్చినా రనిన • రూఢిగఁ దోఁచె నపారతారకల్. 7

ఉ. శ్రీసఖుఁడైన యట్టిసర • సీరుహలోచను సన్నిధిం బరో
జాసను శాసనంబున వి • హాయసదీపిక లెత్తిరో యనన్
భాసిత దీపగర్భ మణి • భాజనముల్ గడుఁదేజరిల్లె సం
ధ్యాసమయంబునన్ వరగృ • హాంతరనిర్మితయంత్రపీఠులన్. 8

వ. అప్పుడు. 9

క. కరదీపికా శతంబులు
నరవరునాజ్ఞన్ వహించి • నానాసేనా
పరివృఢులు హితులు భృత్యులు
వరుసన్ మరి వారివారు • వారున్ వారున్. 10

క. అరిగియును [1]దదన్వేషణ
పరులై యాహ్వానములను • బహుభంగుల న
ల్లరసి [2]యుబాలుం గానక,
మరలం జనుదెంచి యనిరి • మసలక యంతన్. 11

గీ. పొదల నదుల పట్లఁ • బులినతలంబులఁ
దరువులందుఁగూప • తటములందు
సరసులందు వటుని • జాడయించుక లేదు
ధరణిపైన నంత • దండపాల !

---

1. క. దదారోపణ. 2. క. కొండొకటి

వ. అని విన్నవించుటయును విని యతిదీనవదనుండయ్యు నంతట సమస్తద్విజుల భుజింపంజేసి, తా నట భోజనవివర్జితుండై యొక శుచిప్రదేశంబున దర్భాస్తరణం బొనరించుకొని సమాహితస్వాంతుం డయి తద్విధంబునకు బహువిధధ్యానగరిష్ఠుం డగుటయుఁ గొంతదడవునకు దైవానుగ్రహంబున నిద్రాసమన్వితుం డగుటయుఁ దదీయస్వప్నంబునం దస్వప్నవిభుం డగు శ్రీహరి యివ్విధంబున. 13

అనంతపాలునకు స్వప్నమున శ్రీ హరి ప్రత్యక్షమగుట.

సీ. ఘననీల మేఘ సం § కాశ దేహముతోడఁ
గమనీయ శంఖ చ § క్రములతోడ
దర్పకకోటి సౌం § దర్యరూపముతోడఁ
గమలాధివాస వ § క్షంబుతోడ
నరవింద విలసితా § యతనేత్రములతోడఁ
జంద్రమండల ని భా § స్యంబుతోడ
... ... ...
... ... ...
దినకర సహస్ర సదృశ సం § దీప్తితోడ
సకల భూషణ భూషిత § చాకచక్య
కలిత మగువల్లభ స్వామి § కరుణతోడ
దండపాలునిమోలఁ బ్ర § త్యక్షమైన. 14

క. కనుఁగొని సంప్రీతిఁ బునః
పున రభినుతు లొనరఁ జేసి § భూభుజుఁడు మహా
వినయమున దేవదేవునిఁ
గొనియాడఁ దొడంగె నతుల § కుతుకాన్వితుఁడై. 15

భుజం. జగన్మోహనాకార § జంభాసురారి
ప్రగణ్యాపరంధామ § భక్తాంతరంగా
ఖగానీకరాడ్వాహ § కంజాయతాక్షా
దిగంత స్ఫురత్కాంతి § దేదీప్యమానా. 16

భుజం. అమర్త్యాభిధేయాభి ~ యాతిప్రదాహా
సమస్త ప్రశస్తాబ్జ ~ శార్ఙ్గారిబాహా
రమావాస వక్షః స్వ ~ రాణ్ణీలదేహా
సమస్తే నమస్తే [1]ప్ర ~ ణామాన్వితేహా. 17

చ. అని యటు దేవదేవుఁ గొని ~ యాడి మహాత్మక, యెవ్వఁ డీవు వ
చ్చినకత మేమి యం చెపుగఁ ~ జెప్పఁ దొడంగెను దండపాలుతో
వనజదళాయతాక్షుఁడగు ~ వల్లభదేవుఁడు మున్ను నాడిసం
బున వటుపుంగవాకృతి న ~ పూర్వముగాఁ జని నీదు సన్నిధిన్. 18

క. వినిపింప విని యెఱుంగుదు
[2]వనఘోత్తమ తావక స్వ ~ హస్తంబున నేఁ
గొననే భూవృత్తిదశక
మనువుగ దానంబు వల్ల ~ భాఖ్యుఁడ ననుచున్. 19

గీ. జనవరోత్తమ యే నహి ~ చ్ఛత్రపురము
వలన నెడఁబాసి యిచ్చట ~ వచ్చి నిలిచి
యున్నవాఁడను క్షిప్రమ ~ యుర్విఁగాన
మత్ప్రతిష్ఠయు గావింపు ~ మహితముగను. 20

చ. నృపవర బ్రహ్మకుండి తటి ~ నీతటి శంకరదివ్యధామ మొ
ప్పు పురమునందు విప్రకుల ~ ముఖ్యుఁడు వామనశర్మగేహమం
దపరిమితార్థసిద్ధి యగు ~ నట్లు కటిల్లకవీరుదాలవా
లభువిని పౌరుషద్వయ బి ~ లంబుననే వసియించి యంతటన్. 21

గీ. అస్మదీయప్రతిష్ఠకై ~ యభిలషించి
విప్రవటురూపధరుఁడనై ~ విభవ మలరు
తావకీనసభాప్రాప్తిఁ ~ దనరి యేను
నర్థితార్థ ప్రదాయినై ~ యర్థికరణి. 22

1. క. ప్రణామస్వదేహా. 2. చ. ఎఱుంగుచు నసఘాత్మక.

క. వెఱవక వేఁడితి దివ్యుల
కొఱకై మును బలిని నాదు ఽ కొఱకై యిపుడున్
నరవర నిను యాచించితి
ధరణీదానంబు సర్వ ఽ దా నుతి కెక్కన్. 23

మ. అఖిలైశ్వర్య సమేతుఁ డబ్జభవము ఽ ఖ్యధ్యేయుఁడు న్నిందిరా
సఖుఁ డీభంగిని విప్రవేషధరుఁడై ఽ సర్వంకషప్రజ్ఞమై
శిఖి విభ్రాజితమూర్తి యాచకుగతిం ఽ క్షేత్రంబు రాజేంద్రుచే
సుఖసంగ్రాహకుఁ డయ్యె నంబువులతో ఽ సూరిస్తవం బొప్పఁగన్. 24

చ. కలియుగమందుఁ బార్థివులు ఽ కల్మషులైనను నీమహాకథా
విలసన మాలకించినను ఽ వృత్త్యపహర్తలు గారు మేదినీ
వలయములోన నీవాసఁగ ఽ వాంఛలు దీఱఁ దదీయవృత్తియున్
వలనుగ నారగించుచు ని ఽ వాసముగా వసియింతు నిచ్చటన్. 25

వ. అని విమర్శజ్ఞానచిత్తుండనై యతిధార్మికుండ వగు నిన్నుం జెంది యుగధర్మం
బూహించి యేను కుహానంబుగా యాచించితి నదికారణంబుగా నస్మదా
కర్షణం బొనరించి యథావిధిక్రమంబుగా మత్ప్రతిష్ఠ యొనరించి యసమాన
కీర్తి వహించి సమస్తభోగభాగ్య సంపద్వైభవంబులం జెందు మింక నుప
వాసంబునం గృశింపక భుజియింపు మని పలికి యిందిరాధీశుం డదృశ్యుం
డయ్యె నయ్యెడ. 26

ఉ. పూతచరిత్రుఁడై భువన ఽ ముల్ వెలుఁగొందఁగఁ జేయునట్టి ప్ర
ద్యోతనుఁ డేఁగుదాఁకను మ ఽ హోత్సవమున్ రచియింపఁ బూనియున్
భాతిగ విష్ణుసన్నిధి సు ఽ పర్వ లొనర్చిన యట్టి యాజగ
జ్జ్యోతి యనంగ నొప్పెసఁగె ఽ శుభ్రమరీచి యదభ్రదీధితిన్. 27

ఉ. పాండుపటీరరేఖ లనఁ ఽ బర్వియు విర్వఁగఁ దేజరిల్లె బ్ర
హ్మాండ కటాహ భిత్తిని సు ఽ ధాశను లచ్యుతు నుత్సవార్థమై
నిండు సుధానులేపమతి ఽ నిర్మలభాతి నొనర్చినట్లు కన్
పండువుగాఁ బ్రపంచవిభ ఽ వంబుగ నాహరిణాంకచంద్రికల్. 28

వ. అంత ననంతదండపాలుండు మేల్కాంచి యోగసమాధి చాలించియాస్వప్న వృత్తాంతం బంతయు మంత్రి పురోహిత హిత ప్రభృతి సమస్తజన సన్నిధి నెఱింగించి భోజన కృత్యంబు దీర్చి, యతి సౌఖ్యంబుగా నారాత్రి పుచ్చినం బ్రభాతం బగుటయు. 29

ఉ. సోమ సువర్ణకాంతిగల శుక్రబృహస్పతు లంత వేకువ
జామునఁ దోఁచిరన్ విమల చారుసరోవరబింబితంబులో
స్వామికి నుత్సవం బలర సన్నిధిఁ జేర్చిన వజ్ర (స్వర్ణ?) దండవ
చ్చామరరాజి నాఁ బరగె శక్రదిశన్ మహనీయవైఖరిన్. 30

చ. కొలకొల మంచు వృక్షములఁ గోకిల కీర మయూర శారికా
కలరవకూజితం బలరు కాకుళదేవునిమేలుకొల్పు మం
గళతరతాళగానముల కైవడి దిక్కులు తేజరిల్లఁగాఁ
బలపలవేగె నంత శశి భాస్కరు లస్తమయోదయంబునన్. 31

చ. రజతహిరణ్మయాకృతి వి రాజిత కుంభయుగంబునన్ సము
ద్రజలము నింపి వెన్నునకు దాత్తత మజ్జన మాచరింప ది
గ్గజముల మీఁద వేల్పు లధి కంబుగఁ దెచ్చిరి నాఁగ నొప్పి రం
బుజరిపుఁడున్ దివాకరుఁ డ పూర్వముగాఁ జరమోదయాద్రులన్. 32

శ్రీకాకుళమున శ్రీ వల్లభుని బునఃప్రతిష్ఠ చేయుట.

వ. అంత ననంతదండపాలుండు కాల్యాకరణీయంబులు దీర్చి వంది మాగధ సందోహ పాఠకపఠన నిజవిజయాంకిత గీతంబు లాలకింపుచుం జని చని నిఖిల విద్వజ్జన ప్రధాన పురోహిత సుహృద్భట దౌవారిక విలసితంబగు నాస్థానాంశుకసదనంబునం బ్రవేశించి విప్రనికరాశీర్వాదనాదంబున కను మోదింపుచు రమణీయ చీనాంశుక రత్నకంబళ విరాజితాస్తరణంబున సుఖాసీనుండై యుండి యప్పుడు.

గీ. హితుఁడు విష్ణుభక్తి యుతుఁడు విప్రశ్రేష్ఠుఁ
డతులగుణ గరిష్ఠుఁ డైనయట్టి
తనపురోధు నంతఁ దగ నవలోకించి
హర్షయుక్తి దనర ననియె నిట్లు. 34

ఉ. వందనమయ్య విప్రకుల । వర్యుఁడ నీకు సమస్తదేవతా
వందితు నిందిరావిభు న । వశ్యము దోడ్కొని రమ్ము యిప్పుడే
పొందుగ వైష్ణవోత్తమ సు । పుష్పక సత్పరివారధీరతా
బృందముతోడ నేఁగు తడ । వియ్యెడ నిల్వకు మంచుఁ బల్కినన్. 35

మ. విని విప్రర్షియు వారిఁ దోడ్కొనుచు స । ద్విశ్వాసపూర్వంబుగాఁ
జని యప్పట్టణమందు వామను నివే । శంబుం బ్రవేశించి చ
య్యన నప్పాఉనిఁ బూజచేసియుఁ దదీ । యానుజ్ఞచే మేదినీ
ఖననంబుల్ రచియించి యంచితరసా । గర్భస్థు సర్వేశ్వరున్. 36

సీ. దళముగాఁ బా తాళ । తలవాసు లనుదిన
మర్చించు చందన । చర్చతోడ
సకలంకభూషిత । సక లాభరణమాల్య
తతులతో నాయుధ । వితతితోడ
నలరు శ్రీవల్లభు । నవలోకనముచేసి
ప్రేమాంతరంగులై । వినయవినతు
లతిభక్తి నొనరించి । యర్ఘ్యపాద్యాదుల
నపచితి గావించి । యలఘుయోగ్య

యానగతుఁ జేసి పరివార । సేనతోడ
శంఖకాహాళమురజని । స్సాణవాద్య
జాతనినదసిత ధ్వజ । చ్ఛత్రచామ
రములతో వందిజనగేయ । రవముతోడ. 37

వ. ఇవ్విధంబుగ మహావైభవాన్వితంబుగా నప్పురంబువలనం గదలి చని కాకుళ
క్షేత్రంబు చేర నేతెంచు సమయంబున. 38

చ. అనువుగ మున్ను శంకర మ । హాలయసన్నికటావనీబిలం
బున వసియించి వచ్చుతఱిఁ । బూర్వసుహృత్త్వము వాయలేమి స
జ్జనహితకారి యాటయు ని । రూఢిగ నల్లఁ బ్రసన్నమల్లికా
ర్జునయుతయాయి యైన మధు । సూదనువార్త వినన్ రయంబునన్. 39

ఉ. దండధరప్రతాపుఁ డతి । ధార్మికుఁడైన యనంతదండపా
లుండును సంశయంబు మది । లోనఁ దొలంగి సమస్తయూథపే
దండముఖాంగముల్ నడువ । దవ్వునకై యెదురేఁగి కోటి మా
ర్తాండవిరాజమానుఁ డగు । తామరసాయతనేత్రుఁ గాంచియున్. 40

గీ. నతులు వేమా రొనర్చి వినమ్రుఁ డగుచుఁ
దనపురోహితుఁగాంచి సం । తసముతో స
పర్యగావించి యత్యంత । భక్తి వివిధ
వాద్యనృత్తవినోద వై । భవము మెఱయ. 41

వ. ఇవ్విధంబున మహోల్లాసంబుగాఁ జని యనంతరంబ శుభదివసనక్షత్ర యోగయుక్తంబగు సమ్యఙ్ముహూర్తంబున శుభలక్షణలక్షితుం డైన శ్రీవల్లభదేవుని విష్వక్సేనాది నిత్యసూరి పరివార సమేతంబుగా విఖనస సూత్రాగమోక్తంబునం బ్రతిష్ఠించి మఱియును. 42

గీ. వీరభద్రకుమారక । విఘ్నరాజ
పార్వతీ నంది భృంగీశ । భైరవ యుత
భవునిఁ దత్ క్షేత్ర పాలక । పటిమ దనర
నిష్ఠతో దక్షిణదిశం బ్రతిష్ఠచేసి. 43

సీ. మరకత మణిమయ । మహితాలయద్వార
చామీకరకవాట । చంద్రకాంత
సోపానవేదికా । సాలభంజీస్తంభ
సంభృతమంటప । సముచితంబు
ప్రాకారగోపురా । నీకవిచక్షణ
ధ్వజ పటాభి శ్రేణి । భాసురంబు
కల్యాణచందనా । గారతోరణకుడ్య
పాంచాలికాయంత్ర । సంచయంబు
రాణ నిర్మాణ మొనరించి । రథవితాన
హాటకాందోళికా గజ । హంసవాజి

వాహనము లొసఁగి నిఖిలోత్సవంబు లమర
వివిధవాద్యము లర్పించి ౕ వినుతి మెఱయ. 44

గీ. చారు నవరత్న ఖచితసుజాతరూప
మంజుమంజీర కేయూర ౕ మకుటహార
కటకకింకిణికాంచికా ౕ కర్ణకుండ
లాంగుళీయా ద్యలంకారి ౕ తాంగఁజేసి. 45

చ. నగరకృతప్రతిజ్ఞుఁ డయి ౕ నవ్యగృహాంగణసౌధవీధికా
ద్యగణితధాన్యకర్బుర స ౕ మగ్రము సర్వజనప్రపూరితం
బుగ నొనరించె ముక్ సుమతి ౕ భూపతియుక్ రచియించినట్లుగా
నిగమచయ ప్రశాస్త్రక్రమ ౕ నీయము కాకుళపట్టణాఖ్యమున్. 46

సీ. నిలయంబులను రత్న ౕ నివహసమీచీన
మైనకవాటసం ౕ ధాన మమర
వాచస్పతి సమాన ౕ వాగ్వైభవవిచిత్ర
వేదశాస్త్రాభిజ్ఞ ౕ వైదికులకు
బీభత్ససదృశ వి ౕ భీషణ రణజయో
పార్జితులైనట్టి ౕ బాహుజులకు
శ్రీశున కెనయన ౕ సిరులఁ బెంపందు న
త్యూర్జితవాణిజ్య ౕ [1]సర్జులకును
నపరిమితధాన్య కర్ష కసహాలవితాన
సంపదున్నతులైనట్టి ౕ చరణజులకు
నిత్యమాధవకైంకర్య ౕ నిపుణమహిమ
కాపురంబగుకాకుళా ౕ ఖ్యాపురంబు. 47

చ. అనుదినపక్షమాసయుగ ౕ హాయనసర్వమహోత్సవంబులక్
దనరి మృదంగవాద్యపటు ౕ తాళవితానసుగానపద్ధతిక్
వనజదళాక్షు సన్నిధి న ౕ వశ్యము నర్తనకేళి కప్సరో
వనితలఁ బోలినట్టి బహు ౕ వారవిలాసిను లుందు రప్పురిన్. 48

చ. చలదళ తింత్రిణీవకుళ | చంపక కేసరనారికేళవం
జుల కదళీతమాల వట | చూతకపిత్థక బిల్వ సాలజం
భల పనసాది భూరి తరు | వార వనావలు లప్పురంబుచెం
తల నిరువంకలం దనరు | నందనచైత్రరథంబులో యనన్. 49

క. సరసిజ కైరవ హంసో
త్కరకోకబకాది కలిత | గంభీరజలా
కరములు మూఁడును నాలుగుఁ
బరగుఁ దత్పురముచుట్టు | వార్ధులో యనఁగన్. 50

క. తత్తద్విధమున నొనరిచి
విత్తవ్యయమునకు నోర్చి | విఖ్యాతిమెయిన్
మత్తారిరాట్కదంబము
నత్తఱి విజిగీషుకాంతుఁ | డై యటమీఁదన్. 51

గీ. వల్లభస్వామి కతి భక్తి | వందనములు
పొందుగాఁ జేసి తదనుజ్ఞఁ | బొంది మఱియు
దండయాత్రాసముత్సాహ | తరగభీర
రణజయార్చిత నిస్సాణరావ మడర. 52

అనంతపాలుఁడు కాంచీపురమును జయించి విజయాంక శాసనమును స్థాపించుట.

సీ. కదలి హేమాద్రి సం | కాశంబు లైనట్టి
యతిశతాంగశ్రేణు | లభిగమింప
మేచకాభ్రావలి | సూచకం బైనట్టి
భద్రగజానీక | పటిమ దనర
గంధవహాంచిత | గమనంబులైనట్టి
సైంధవ సముదాయ | బంధురముగ
దంభోళిశకల సం | రంభాంగులైనట్టి
పటు పదాతిగ పరం | పరలు నిగుడ

వివిధ చతురంగసైనిక | వితతి గొలువ
దస్యుపరివార గర్వ వి | దారుఁ డగుచు

నాఖువాహనసహజ వి ఽ శాఖు కరణి
దండపాలుండు నాహవోద్దండలీల. 53

చ. అరిగియుఁ గాంచికాపురము ఽ నందలిమూర్తుర నెల్లఘోర సం
గర విజిగీషువై తదధి ఽ కారులచే నరి గొంచు నచ్చటన్
స్థిరవిజయాంకశాసన ము ఽ దీర్ణతరంబుగ నిల్పి మర్లి వే
గిరి కటకాభిధాన పురి ఽ కిం జనుదెంచె నుదంచితార్భటిన్. 54

శ్రీకాకుళేశుని మాహాత్మ్యమునకు నిదర్శనములు.

వ. అంత నిక్కడ. 55

శా. గంగాకూలముఁ బాసి శ్రీహరియు రం ఽ గత్తుంగ కృష్ణాసరి
త్సంగప్రాంగణభూమి కేఁగియు మను ఽ ష్యశ్రేణి సేవింప నీ
భంగిం గామితకామ్యదాయి యగుచున్ ఽ భాసిల్లి యెల్లప్పుడున్
శృంగారంబుగ దండపాలకమహా ఽ శిక్షాప్రకారంబునన్. 56

గీ. చేయునట్టి నిత్య ఽ సేవలు గైకొంచు
భక్త సుప్రసన్న ఽ భావ మమరఁ
బంకజాక్షుఁ డెపుడుఁ ఽ బద్మా సమేతుఁడై
నిలిచియుండు నంత ఽ నెమ్మితోడ. 57

గీ. పుడమిలోపల నుత్కల ఽ భూభుజునకుఁ
గూఁతు రొక్కతె కలిగియుఁ ఽ గొడుకు లంత
లేకయున్న నిరంతర ఽ వ్యాకులమును
జెంది యిలుతీర్థముగ నటు ఽ చేర నరిగి. 58

మ. ప్రకటస్తోత్రము లొప్పఁ గాకుళపతిం ఽ బ్రార్థించి పుత్త్రార్థియై
యకలంకంబుగ వేఁడ నానృపుని స ఽ మ్యగ్భక్తికిన్ భక్తపో
షకుఁడైనట్టి జనార్దనుం డఖిల వి ఽ శ్వస్తుత్యుఁడై రాజపు
త్త్రికనుం బుత్త్రునిగా నొనర్చె నిజశ ఽ క్తిన్ విస్మయఖ్యాతిగన్. 59

గీ. మఱియు నొకనాఁడు సజ్జనఽమాన్యుఁడైన
దండనాథపురోహితు ఽ ధనముఁ జోరు

లపహరించుటయును మనోవ్యాకులమునఁ
గాకుళాధిపుఁ గూరిచి గారవమున. 60

క. నతి నుతు లొనరించుచు స
మ్మతితో ధ్యానంబుసే యు మహితద్విజు నా
శ్రితవత్సలుఁ డగు లక్ష్మీ
పతి యాత్రాప్రార్థనముచేతఁ బరమప్రీతిన్. 61

మ. అతిదూరాగతుఁడైన తస్కరుని న త్యంతవ్యథామోగజ
క్షితుగాఁ జేసి యపహృతద్రవిణముల్ శీఘ్రంబుగాఁ గ్రమ్మఱన్
జతనం బొప్పఁగఁ దెచ్చిపెట్టుటకు నై సర్గంబుగాఁ జేస యా
శ్రిత రక్షామణి సర్వవేద్యుఁ డెఱిఁగిం చెఱద ద్విజశ్రోత్రికిన్. 62

వ. వెండియు నొక్క సమయంబున. 63

చ. నిరుపమపుణ్యశీల కమ నీయ శుభావహ విప్రభార్య శ్రీ
ధరునకు ధేనుదుగ్ధము లు దారత నెజ్జిఁగఁ గాఁచి మంజు మా
సరసహితంబుగాఁగ నని శంబు సమర్పణచేయుచున్న భూ
సురునిమహిమ్మ నొక్కతఱిఁ జోరకుఁ డర్థి నపహ్నవించినన్. 64

క. వారిలు ప్రార్థన చేయఁగ
గారవమున వానిఁ జూడఁ గనునట్లుగఁ దా
నారూఢిగ నెఱిఁగించి యు
దారత నిప్పించె మహిమఁ దస్కరుచేతన్. 65

వ. మఱియు నొక్కకాలంబున. 66

క. పరిచారకుఁ డొక చామీ
కరపాత్రము బయల నునిచి కను సందడి నే
మఱియుండ నొక్క దుర్మతి
దరి దప్పియుఁ దస్కరించి తగఁ గొని చనియెన్. 67

చ. అది యొకచోట విక్రయమున మర్థత లేక దురంతవేదనన్
మది భయ మంది వేగ నఖి మానముతోఁ గొనివచ్చి క్రమ్మఱన్

నొడిఁగి ధరాప్రదేశమున ఽ నుంచి నమస్కరణం బొనర్చి దే
వ దురితకర్ముఁడన్ జడుఁడఁ ఽ బాలసుఁడన్ గృప నన్నుఁ గావవే. 68

క. అని యాంధ్రనాథు నీగతిఁ
గొనియాడి యనంతరంబ ఽ గోష్ఠంబుగ వాఁ
డును జనియె నిజగృహంబున
కనువుగ శ్రీకాకుళేశ్వ ఽ రాజ్ఞాభిజ్ఞన్. 69

వ. మఱియు నొక్కవిశేషంబు. 70

గీ. అత్యనాచారపరుఁడు వే ఽ శ్యాభుజంగుఁ
డై రమావల్లభస్వామి ఽ కను దినంబు
నర్చ లొనరించు నం ఽ దొక యర్చకుండు
హృదయ మందున లజ్జావి ఽ హీనుఁ డగుచు. 71

వ. అంతట. 72

చ. శ్రీవిభుసేవ చేయుటకుఁ ఽ జిత్తము రంజిల నేఁగి యామహా
భూవరుఁ డొక్కనాఁ డచటి ఽ పూజలఁ జూచి తిరస్కరించి వే
పోవఁగ నాతనిం దఱిమి ఽ పూతచరిత్రకుఁ డైనయర్చకున్
వావిరి నిత్య [1]కైంకరియ ఽ వైభవముల్ రచియింపఁ జేసినన్. 73

గీ. సంతతాచార సంపత్తి ఽ సహితముగను
పూజ గావింపగా మన ఽ స్స్ఫూర్తిచేత
వల్లభస్వామి యా నృపు ఽ స్వప్నమందు
హర్షముగ నేఁగి ఽ యిట్లని యానతిచ్చె. 74

క. నృపపుంగవ, మద్భక్తుల
కపవిత్రత గలదె నాకు ఽ నతఁడే హితుఁ డా
నపచితిఁ గావించుట కనఁ
గృప నతనిన్ మగిడి కూర్చెఁ ఽ గేశవుమహిమన్. 75

1. ‘కైంకర్య’ అనుటకు ‘కైంకరియ’ అని కవి యుపయోగించియుండును.

క. పతితానుపావనంబులు
సతతం బాంధ్రాధినాథు - సచ్చరితంబుల్
నుతియింప నద్భుతంబులు
హితులకు నత్యంతముక్తి - హేతుకరంబుల్. 76

గీ. ఇవ్విధంబునఁ గాకుళాధీశ్వరుండు
భక్తజనసేవ్యుఁడై ముక్తిపదనివాసు
కరణి సంతోషచిత్తుఁడై - ధరణిమీఁద
శ్రీసతీ సంయుతముగ వేంచేసియున్న. 77

వ. అట్టి విష్ణుపురోత్తమం బన నొప్పు శ్రీకాకుళభర్తసన్నిధియందు. 78

మ. జను లాషాఢవళక్షపక్షహరివా - సం బందు శ్రీస్వామి న
ర్చన గావించి మహోత్సవంబు రచియిం - చం దృప్తుఁడై వారు కో
రిన కోరుకల్ కృపసేయుచుండు హరిదా - రిద్ర్యాఘ సంహారికాం
చన పీతాంబరధారి భూరికరుణా - సంచారి దైత్యారియున్. 79

వ. వెండియు. 80

మ. అతుల శ్రావణ కృష్ణపక్షయుత స - మ్యక్కృష్ణజన్మాష్టమిన్
దతనాదాన్విత గీతవాద్యములచే - తన్ గంధపుష్పాద్యలం
కృతు లొప్పంగ సపర్యచేసిన హృషీ - కేశుండు సంతుష్టుఁడై
యతి కృత్పాపము లెల్లఁబాపి హృదయా - హ్లాదం బొసంగున్ దయన్.

చ. మఱియును గార్తికాఖ్య శుభ - మాసము పాండురపక్షమందు శ్రీ
హరిదివసంబునన్ ఘన భ - వార్ణవ తారక యాన పాత్రమై
పరగిన యిందిరా రమణు - భక్తి నమస్య లొనర్చి మానవుల్
దురిత విదూరులై తుది న - ధోక్షజ లోకముఁ గాంతు రిమ్ముగన్. 82

గీ. మనుజు లెవ్వరైనఁ - గార్తికమాసమందు
శ్వేతపక్షాంచిత ద్వాదశీ దినంబు

కాకుళేశ్వరుఁ బూజింప ఽ ఘనత మెఱసి
మోక్షసంప్రాప్తు లగుదురు ఽ ముద మెలర్ప. 83

చ. తరణియుఁ జాపసంక్రమణ ఽ తం బగు మాసమునందుఁ గాకుళే
శ్వరునకు ధూపదీపములఁ ఽ జారుసుమంబులఁ బూజచేసి చా
మరధవళాతపత్రమణి ఽ మండనమండితుఁ జేసియుఁ మనో
హరముగ ముద్గభక్తపర ఽ మాన్నము లర్పణ చేయువారికిన్. 84

గీ. సంశయంబులేదు ఽ జగదీశుఁడగు రమా
వల్లభుండు వారి ఽ వాంఛలెల్ల
సఫలితంబుచేయు ఽ సర్వ సర్వంసహా
రక్షకుండు దనుజ ఽ శిక్షకుండు. 85

క. మకరాయనకాలంబున
సకలంకోద్యానవన స ఽ మాశ్రియుఁ గడునం
దకధరు నిరుపమ భక్తిని
సుకృతాత్మకు లెవ్వరైనఁ ఽ జూచెద రేనిన్. 86

గీ. కలుష నిర్ముక్తులై యతి ఽ కౌతుకమునఁ
బొదలి పిమ్మట నిర్వాణ ఽ పదముఁ గాంతు
కాకుళాధిప మహిమ నే ఽ కాంతభక్తు
లాత్మ నుతియింప శ్రీహరి ఽ హర్షమునను. 87

వ. అధికంబుగా ననుగ్రహించు నివి మొదలగు సమస్త పుణ్యాదినంబులయందు
హృషీకేశు నారాధించు మర్త్యులిహంబునం దనుదినభోగభాగ్యసంపద్వై
భవంబులం బొదలి యనంతరంబ శరీరావసానసమయంబున నిత్యముక్త సేవి
తంబగునట్టి వైకుంఠపద ప్రాప్తు లగుదు రనిన విని మునులు సంతుష్టాంతరంగు
లై రంత సూతుండు మఱియు నిట్లనియె. 88

క. నిరతము నీగతి సంవ
త్సరములు మాసర్తు పక్ష సకలదినములఁ
వరుస సమర్చన లలరఁ
తిరుకల్యాణోత్సవం బు దీర్ణత వెలయున్. 89

వ. అది యెట్లనిన. 90

ఉ. వాహన యాగశాలలు వి వాహ సుఖోచితరత్నమంటప
ప్రాహిత రత్నకుడ్య నవ రంగ కవాట వితానగోపుర
శ్రీహరి మందిరాంగణ వి చిత్ర నవధ్వజ సత్రగేహ సం
దోహసుతోరణాదు లతి తోరముగా రచియింపఁ జేసియున్. 91

క. గిరి సదృశతర శతాంగో
త్కర కరిచయ తురగశత ప దాతిగ సేనా
పరివృతులై చని కాకుళ
పురగోపురమందు నృపులు పొరిఁబొరి ధరణిన్. 92

గీ. విడియ నియమింప సైనిక వితతి యలరు
రంగదభ్రంకషోర్మి వా రాశికరణిఁ
బటకుటీర సితధ్వజ బహుళమనుజ
హాలహాలధ్వను లెసఁగఁ గా హళలు మొఱయ. 93

వ. అంత. 94

ఉ. కోరిన పప్పు బియ్యములు కూరలుఁ గాయలు నాజ్యతైలకా
శ్మీరపటీర చూర్ణ నవ చిత్రపటంబులు ఖండశర్కరల్
నారికెడంపుబోళ లద నంబుగఁ గంచ్ర బిడారు డొక్క బిం
డారము లుల్లసిల్లు నిబి డంబుగ నేత్రమహోత్సవంబుగన్. 95

ఉ. అంతట సహ్యజా సరి దు దంచిత తీర్థకృతావగాహు శ్రీ
కాంతునియోగ్యయానగతు గా నొనరించియు భద్రమంటపా
భ్యంతర సీమ చారుమణి హాటక శోభిత సింహపీఠి వే
దాంతవచోవిలాస వసు ధామరకోటి భజింపఁ బెంపుగన్. 96

క. ఆక్షీణ విభవ మొసఁగ వి
లక్షణ వాద్యప్రభేద ʃ లాస్యము లలరన్
లక్ష్మీ కళ్యాణాత్మక
దీక్షంబాంచాహ్నికాను ʃ దిన శుభ మొనరన్. 97

మ. కలమాన్నంబు నపూపపాయసఘృతాం ʃ గారప్రసూపాది భు
క్తుల సంతృప్తులఁజేసి విప్రజనసం ʃ దోహంబులం బొందుగా
నలజైత్రంపువళక్షపక్షతిరుక ʃ ల్యాణోత్సవం బర్థి ది
గ్వలయఖ్యాతిగఁ జేయఁగా హరిశతాం ʃ గప్రాంగణారూఢతన్. 98

సీ. హొయలుగా నచటిచై ʃ త్రోత్సవ సమయంబు
నందున నంత బ్ర ʃ హ్మాండనాథుఁ
డాద్యంతశూన్యుండు ʃ హరవిరించ్యర్థితుఁ
డగు రమావల్లభుఁ ʃ డతులమహిమ
నుదయాద్రిమీఁదఁ బ్ర ʃ ద్యోతనుకైవడి
రత్నసానుమనోహ ʃ రమ్ములైన
రథముపై శోభా వి ʃ రాజితంబుగ సిత
చ్ఛత్ర ధ్వజాంచిత ʃ చామరములు
మెఱయ వేంచేసి జనపరం ʃ పరలు పొగడ
వందిమాగధకోటి కై ʃ వార మమర
గాననృత్యవినోద సం ʃ తాన వివిధ
భూరి భేరీనినాదముల్ ʃ భోరుకలఁగ. 99

సీ. సురభిచంపకతైల ʃ పరిషిక్తరంజిత
కరదీపికాసము ʃ త్కరము వెలుఁగ
స్వరయుక్తఋగ్యజు ʃ స్సామ గానంబుల
బ్రాహ్మణశ్రేణులు ʃ భజనసేయ
మాళవ నేపాళ ʃ మలయాళ పాంచాల
చోళ భూపాలకుల్ ʃ సురటు లిడఁగ

కటక కళింగాంగ ‡ కాశ్మీర పతులు హ
స్తములతో నాల వ ‡ ట్టములు పట్ట

గీ. సకలజనరంజనీయ సం ‡ చార విరళ
వైఖరికి నగ్రతలమున ‡ వలను మిగుల
మాటికిని వేత్రహస్తు లా ‡ ర్భాటముగను
దెరపి గావించుచును బరా ‡ బరులు సేయ. 100

ఉ. రంగులుమీఱు చొక్కపుఁ జె ‡ రంగులుఁ జీరలు బెళ్కు పింజలున్
రింగులు వారఁ గట్టి బవి ‡ రెల్ గొలుసుల్ మొసలైనజాళువా
బంగరు సొమ్ము లంగముల ‡ బాగుగఁ దాల్చి మేళయుక్తవా
రాంగన లుర్విపై నభిన ‡ యంబున నాడ వినోదవైఖరిన్. 101

ఉ. రాజపథంబునం జనఁగ ‡ రాజనిభానన లప్పురంపు వి
భ్రాజితసౌధవీథి నను ‡ రాగము లుప్పతిలంగ నెక్కి ని
రాజనభాజనంబులు క ‡ రంబుల రంజిల నొప్పు దేవతా
రాజి విమానరాజముల ‡ రత్నపుటారతు లెత్తిరో యనన్. 102

చ. నగరపురంధ్రు లెల్లెడఁ బు ‡ నఃపున రుత్సవవేళలందునన్
సొగసుగ మేడలం బొలిచి ‡ శుభ్రితరాక్షత పుష్పమౌక్తికా
ద్యగణితమైన సేసలు న ‡ యంబునఁ జల్లఁగఁ జూడ నొప్పెనీ
పగిదివిమానయానసుర ‡ భామలపువ్వులవాన కైవడిన్. 103

ఉ. ఇందు నిభాస్య లుప్పరిగ ‡ లెక్కి గవాక్షుల నిక్కి చూచుచో
నైందవఖండమౌళు లయి ‡ యంగన లచ్యుతసేవ కేఁగి గో
విందుని రెండుపార్శ్వముల ‡ వియ్యపుమేళములన్ వహించి రన్
చందము దోఁచెఁ జక్రధరు ‡ సన్నిధిసౌధము లద్భుతంబుగన్. 104

ఉ. కొందఱు మందగామిను ల ‡ కుంఠితమంగళరంగవల్లికా
సుందరభిత్తిభాగపరి ‡ శోభితతోరణపార్శ్వభూము లం
దందము మీఱ మౌక్తికపు ‡ టారతు లర్పణసేయు టొప్పెఁబౌ
రందరభామ లెల్ల హరి ‡ రంభణకేళికి వేఁడిరో యనన్. 105

ఉ. హారవిభూషణాంబర చ ఽ యాద్యకలంకపరిష్కృతాంగులై
వారిజనేత్ర లిర్వు రొక ఽ వంకఁ గనుంగొనఁ బొల్చి రాబహి
ర్ద్వారము చెంత నంచిత భు ఽ జాంతర భాజనయుగ్మరంజిత
స్ఫారకుచద్వయ ద్విగుణ ఽ భర్మఘటంపునివాళులో యనన్. 106

మ. అరవిందాక్షియొకర్తు పాండురపటీ ఽ రాలేప మైనంతటన్
హరి యేతేరఁ బ్రపత్తి హస్తములఁజే ఽ యం గన్గొనం బొల్చె ని
ష్ఠురతత్పీనపయోధరద్వయ మనే ఽ సుస్వర్ణఖర్జూర క
ర్కరికాకుంభయుగంబు కానిక యొసం ఽ గం దెచ్చెనో నా వెసన్. 107

ఉ. అంగన లాగృహాంగణము ఽ లందుఁ గనుంగొన నిల్తు రట్లు శ్రీ
రంగదురంబు సామి శిబి ఽ రంబులకేఁగెడు వేళఁ దత్పుర
ప్రాంగణ వాటికాతలము ఽ లందు విచిత్రముగా రచించి యా
సంగతి రంగుగా నిడిన ఽ చక్కని బంగరుబొమ్మలో యనన్. 108

ఉ. చక్కని మోహనాంగి యల ఽ జవ్వని చివ్వన లేచి నవ్వుచున్
నిక్కుచు మ్రొక్కుచుం దను వి ఽ నిర్మలకాంతులు పర్వ గర్వపుం
జక్కవదోయిఁ బోలెడి కు ఽ చద్వయముం గరు పారఁ దారుచుం
దక్కుచు వచ్చె నొక్కవని ఽ తామణి తామరసాక్షు డాయగన్. 109

ఉ. తెల్లనిచీరగట్టుక ర ఽ తిక్రియ కాయిత మైనయట్లు గా
నల్లనఁ జిన్నిచన్గవ నొ ఽ యారపుఁబయ్యెదఁ దూఁగ నబ్జుమే
నల్లని నల్లగల్వపువు ఽ టమ్ము విధమ్మున వల్వు గుల్కఁగా
నల్లనిమేనితో నలరె ఽ నాతియొకర్తు సమీపవర్తియై. 110

ఉ. చాన యొకర్తు చన్నుగవ ఽ సందునఁ బయ్యెద నివ్వటిల్లుత
త్పీనపయోధరద్వయము ఽ పిక్కటిలన్ వెసఁ గంచుకంబునన్
గానఁగ నయ్యె నాహరికిఁ ఽ గానుక దెచ్చుదదీయయౌవనో
ద్యానవనోచితాతిగమ ఽ తంగజజంభల సత్ఫలాకృతిన్. 111

చ. కులుకుమిటారి గబ్బి చను ఽ గుబ్బలకోమలి యోర్తు ధూర్తతన్
వలిపపురైకపై జరుగు ఽ వాటముగా వలెవాటుపైఁట కొం

గలర మురారిఁ గన్గొన రయంబున రాఁ గుచయుగ్మ మయ్యెడన్
వల నిడి తెచ్చుజక్కవగవం దలఁపించు మనోహరాకృతిన్. 112

చ. మగువలు కొంద ఱెల్లెడల మాడుగులన్ వసియించి గుంపులై
జగదభివంద్యుఁడైన హరిచందము పొందుగఁ జూచి నెమ్మదిన్
బొగడఁ దొడంగి రీగతి నభోమణి జృంభితకాంతిజాలునిన్
నగధరుఁ బద్మనాభు సుగుణంబులుఁ బల్మరు నుగ్గడింపుచున్. 113

దశావతారములు

ఉ. చామ యితండు తామరససంభవునిం గికురించి నైగమ
స్తోమ [1]మలిమ్లుచుం డుదధిఁ జొచ్చినఁ దా మగమీనురూపమై
సోమకుఁ ద్రుంచి యానలినసూతికిఁ దెచ్చి తదీయఋగ్యజు
స్సామములు న్నథర్వణముసంగెను దొల్లి యుదారవైఖరిన్. 114

మ. అమృతాపేక్షను దేవదానవులు దుగ్ధాబ్ధిన్ మహామందరా
గముఁ గవ్వం బొనరించి వాసుకి నమోఘుస్థైర్యతన్ రజ్జుగా
నమరం జుట్టి మథింపఁ దద్గిరి భరంబై యాఁగఁలేకున్నఁ దాఁ
గమఠాకారముఁ బూని తాల్చెఁ జరమాంగంబంతుఁ గంజాననా. 115

చ. పుడమియుఁ జుట్టఁ జుట్టుకొని పోవఁగ నాతపనీయనేత్రునిన్
బొడ వడఁగించ వేసవన పోత్రియునై రభసం బెలర్ప మున్
జలనిధిఁ జొచ్చి యాతఁ డతిసాహసశాలి సురానుకూలుఁడై
తడయక కొమ్మునన్ ధరణిఁ దాలిచి క్రమ్మర నుద్ధరింపఁడే. 116

చ. వెరవక ఱాతికంబమున వెల్వడి దివ్యులు సన్నుతింపఁగా
నరహరివేషధారి యయి నాలి నతం డతినిష్ఠురంబునన్
బొరలు తఱిన్ హిరణ్యకశిపున్ నఖరోగ్రతరాసిధారలన్
బొరిగొని తత్తనూభవునిఁ బ్రోచె ననూనపరాక్రమంబునన్. 117

1. క. మువల్లభుండు, చ. మమలినల్లభుండు.

ఉ. వారిజనేత్రి తొల్లి సుర వర్యునకై బలిచక్రవర్తినిం
జేరి పదత్రయం బవనిఁ జిత్తము రంజిల వేఁడి యామహా
దారురసాతలంబునకుఁ దాఁచిన వామనదివ్యమూర్తి నిం
డారఁగ నాక్రమించె నభి యాతివిఘాతి జగత్ప్రపూర్ణుఁడై. 118

చ. ఇరువది యొక్కమాఱు వసు ధేశవరేణ్యుల గండ్రగొడ్డటన్
బోరిఁ బరిమార్చి తద్రుధిర పూరము నైదునదంబులై తగన్
ధరణి నొనర్చి దేవపితృ తర్పణముల్ రచియించినట్టి యా
పరశువహాభిరామతను భాసితుఁడై నతఁ డీతఁడే సుమీ !. 119

ఉ. చందనగంధి శౌరిగుణ సంగతు లద్భుతరీతులౌ దశ
స్యందననందనుండయి ర యంబునఁ గానల కేఁగి జానకీ
సుందరిఁ గోలుపోయి రణ శూరకపిప్రకరంబుఁ గూర్చియున్
బొందుగ వార్ధి గట్టి శర పూరముచే దశకంఠుఁ ద్రుంపఁడే. 120

చ. కరమున లాంగలం బమరఁ గాళియభేదికి నగ్రజన్ముఁడై
సురభులఁ గాచి బాల్యమునఁ జొక్కపు గోపనితంబినీసము
త్కరపరిరంభకేళిఁ దగి దైత్యసమూహముఁ ద్రుంచి హాస్తినా
పురిఁ బెకలించె నీ పురుష పుంగవుఁ డద్భుతవిక్రమంబునన్. 121

చ. చలదళకోటరంబునఁ బ్రసన్నత నొందియు బౌద్ధభావనా
బలమున రాక్షసాంగనలు భగ్నతరవ్రతజాలు లౌటగా
నలరిచి మార్గణాకృతియు నై త్రిపురంబులు నొక్కపెట్టునం
గెలిచెఁ దదీయసాహసము కేవలమే వివరింప మానినీ. 122

చ. కలికి తురుష్కరాణ్ణికర గర్వ మడంప హయాధిరూఢుఁడై
మెలఁగుచు మార్తురం గెలిచి మేదినిఁ దొల్లిటిభంగి ధర్మముల్
నిలుపఁగలం డితండు కమ నీయ గుణాకరు డబ్జనేత్రుఁడు
జ్జ్వలకనకాంబరుండు రిపు జాలనిబర్హణశౌర్యధుర్యుఁడై. 123

మ. లలనా, యీతఁ డనంతపాలకునిపా లన్ బాలవిప్రక్రియా
కలనాదంభత భూమిదాన మడుగం గారుణ్యుఁడై యియ్య భూ

తలదానంబు పరిగ్రహించె నిల న ఽ ద్ధాత్రీశుభాగ్యంబు పెం
పలరం గాపుర మీపురంబు రమణీ ఽ యం బయ్యె నం చెంచఁగాన్. 124

లక్ష్మీ శ్రీహరుల వాదము.

చ. విభవ మెలర్పఁ జక్రి తిరు ఽ వీథులఁ కేఁగి జగజ్జగమ్ స
ద్రభస మహార్భటిం దిరిగి ఽ రా నపు డాధ్వని యాలకింపఁగా
నభినవగీతవాద్యనట ఽ నాదివినోదపటిష్ఠుఁ డై స్వయం
ప్రభు వని తోఁచి లక్ష్మియుఁ గ ఽ వాట నిబంధన దండన ప్రథన్. 125

క. ప్రణతరుచిరాంగ నారా
యణ దోరంతర నిరంత ఽ రాశ్రయ యగుచున్
ప్రణయామర్షణమున స
ద్గుణవతియగు చెలిమికత్తె ఽ తో నిటు పలికెన్. 126

ఉ. ద్వారసమీపభూస్థలి న ఽ దభ్రతరార్భటి భేరికానుభాం
కారనినాదభైరవము ఽ గాఁ బరివారమహాజనంబుతోఁ
జేరఁగ వచ్చి నిల్చిరి వి ఽ చిత్రము వా రెవ రిట్లు రాత్రి రాఁ
గారణ మేమి యం చడిగి ఽ గ్రక్కున నాకు నెఱుంగఁ జెప్పుమీ! 127

వ. అని నియమింప నచ్చోటికిం జని వారలతో ని ట్లనియె. 128

ఉ. రాయ మహానుభావ యప ఽ రాత్రి లోకభయంకరంబుగా
నాయుధపాణు లయ్యు నభి ఽ యాతిపరంపరఁ బెం పణంప వి
చ్చేయుటగాక యంచు మదిఁ ఽ జింతిలి ని న్నడుగంగఁ బంపె నీ
చాయ విరోధు లెవ్వ రని ఽ సంశయ మెత్తి రమావధూటియున్. 129

వ. అనిన శ్రీహరి యిట్లనియె. 130

ఉ. వారిజగంధి దిగ్విజయ ఽ వైఖరి లోకచయంబునందు బృం
దారకవారయుక్తముగ ఽ నారదతుంబురగీయమాన సం
చారుఁడ నై చెలంగియును ఽ సాగరజాధవు నన్ను నాఁగి యీ
చేరిక రాయబారము వి ఽ చిత్రముగా రచియింప నేటికిన్. 131

వ. అనిన శ్రీదేవి యిట్లనియె. 132

ఉ. కైరవబాంధవున్ విడని । కౌముదిచాడ్పున మేఘయుక్తశృం
గారతటిద్విభాతిఁ గుతు । కం బలరం భవదీయచారువి
స్ఫారభుజాంతరాశ్రయముఁ । బాయని న న్నిటు నిల్పి రాత్రిసం
చార మొనర్చు టేమి కడు । జాగుగ నిట్లు జనార్దనాహ్వయా. 133

వ. హరి యి ట్లనియె. 134

ఉ. సుకరముగా ప్రవేశమగు । సూరిజనస్తవనీయు నన్ను నే
టికి బహు తర్జనంబులఁ గ । డింది వివర్ణత చూచి దేవతా
ప్రకరయుతంబుగా బయట । వాకిట నిల్పి మదీయసేవకా
నికరము లెల్ల నించుక గ । ణించక తాపనసేయు దిందిరా !. 135

వ. శ్రీదేవి యి ట్లనియె. 136

ఉ. కాముకవృత్తి నింత కని । కారము లేక భవత్ప్రసేవక
స్తోమయుతంబుగా రజని । దొంగలు ద్రిమ్మరునట్టి ప్రొద్దునం
ఝామరు రీతిగాఁ దిరిగి । పాయని కూరిమితోడ వచ్చి తా
నేమము గల్గు నీదు కర । ణీయము తేటపడన్ జనార్దనా ! 137

వ. హరి యి ట్లనియె. 138

ఉ. పాతకులన్ వధించి నిర । పాయముగా నిల సజ్జనౌఘముం
బ్రీతి దలిర్పఁ బ్రోచి యభి । వృద్ధిగ ధర్మము నిల్పఁ గోరి వి
ఖ్యాతిగఁ బుట్టెదన్ బ్రతియు । గంబున నెప్పుడు దుష్టరాక్షస
వ్రాతముతోడ యుద్ధ మొన । రన్ బహుకాలవిలంబ మయ్యెడిన్. 139

వ. శ్రీదేవి యి ట్లనియె. 140

చ. శిరమున నావహిల్లు తుల । సీసముదంచితసౌరభంబు మీ
యురమున శ్రీ సుగంధ మగు । చుండును దేవరకుక్షిలో జగ
ద్భరణనితాంత వాసనలు । తావకనాభివిధాతసౌరభం
బిరువుగఁ బాదపద్మముల । నేర్పడుఁగా నిగమాంతవాసనల్. 141

గీ. అట్టి నీతీరు మేనియం దనఘచరిత
గంధమృగ నాభికాపుష్ప కలితముగను
పరిమళించుట దేమొకో భాసురముగ
వింతలయి తోఁచు మదికి న త్యంతముగను. 142

వ. హరి యిట్లనియె. 143

చ. దుష్టనిశాచరేంద్రుల నె దుర్గొని భండనసీమలోన నా
కష్టుల నందఱం దునిమి కౌతుక ముప్పతిలంగఁజేయఁ దా
మిష్టతరంబుగా సుర ల నేకవిధంబులఁ బుష్పపూగముల్
వృష్టి యొనర్ప నయ్యె నభి వృద్ధిగ వాసన నిందిరాసతీ!. 144

వ. శ్రీదేవి యిట్లనియె. 145

చ. సురుచిర పూర్ణచంద్రుగతి సొంపగు మీముఖమండలంబునే
డరయ హిమాంబుశీకర చ యంబునఁ దోఁగు కుశేశయంబు నా
జిరుచెమ టావహిల్లుటకుఁ జిత్ర మి దే మొకో జారచోరశే
ఖర కపటప్రవీణగుణ కౌశల కేశవ నందశైశవా! 146

వ. హరి యిట్లనియె. 147

చ. గమనశతాంగ ముద్ధతము గాఁ జనునప్పుడు చామరాతప
త్రములు వహించువారు ననుఁ దార్కొని కూడఁగలేక పిమ్మటన్
గ్రమమున నిల్వగాత్రమున రాత్రి సమీరము సోఁకకున్న నీ
చెమటయు నంకురించె సర సీరుహసద్వదనా నిరంజనా!. 148

వ. శ్రీదేవి యిట్లనియె. 149

ఉ. బాలశశిప్రభన్ మదన భాసురచాపశిఖాభవక్రరే
ఖాలలితంబులై మృదుల గాత్రము కింశుకపుష్పసౌమ్యకీ
లాలము లుల్లసిల్ల బహు ళంబుగ నీనఖరాగ్రరేఖలే
లోలితమయ్యెఁ దామరస లోచన యీనతి యిమ్ము సమ్మతిన్. 150

వ. అనిన శ్రీహరి యిట్లనియె. 151

చ. అడవులయందుఁ జెంది మృగ § యారతి భూరుహకుంజపుంజముల్
తడయక చొచ్చి వచ్చుతఱి § దాఁకినమంద్రసకొంకిముండ్లచే
నొడలున జీర లయ్యె నఖ § రోగ్రకృతంబులు గావు కాయమే
ర్పడఁ గనుఁగొంటివేని యప § కీర్తి మనంబును జెంద దిందిరా. 152

వ. అనిన శ్రీదేవి యిట్లనియె. 153

చ. అరయఁగ మౌక్తికానికట § మందు వసించిన విద్రుమంబు నా
దరహసిత ప్రదీప్తమగు § తావకబింబఫలాధరంబు ని
ష్ఠురతర కీరచంచుపుట § చుంబితపల్లవరేఖఁ బొల్చు సుం
దర రదనక్షతవ్రణ యు § తంబుగ నేమికతంబొ తెల్పుమా ! 154

వ. శ్రీహరి యిట్లనియె. 155

చ. సురసముదాయమాన్యము[1] వ § చోః పరుషాసురసైన్యదైన్యముం
బరువడి నొందఁజేయుశశి § భాసుర పాండుర పాంచజన్యముం
ఉరవడి నొత్తి యూఁద నధ § రోష్ఠతలంబున నిట్లు గంట్లుగా
నొరసిన యట్టె నొక్కు, లివి § యొకలశాంబుధికన్యకామణీ !. 156

వ. శ్రీదేవి యిట్లనియె. 157

క. హరినీల నిభశ్యామల
తరసుందర తావకాచ్ఛ § తనువందున సు
స్థిరకాశ్మీర హరిద్రా
స్ఫురితాంకము లేమొ § పురుషపుంగవ చెప్పుమా ! 158

వ. హరి యిట్లనియె. 159

క. వికచారవిందహల్లక
నికరాకర నికటభూమి § నిలిచినయెడలన్
ప్రకటముగ మారుతాహతి
నకలంక ప్రసవరజము § లంటె శుభాంగీ ! 160

---

1. "వచోఃపరుషా" వచఃపరుష అనుటకు కవి "వచోపరుష" అని వాడియుండెనేమో !

వ. శ్రీదేవి యి ట్లనియె. 161

గీ. పుండరీక నిభంబులై భువనమోహ
నంబులైనట్టి మీ నయనంబు లిప్పు
డరుణకాంతి [1] యుతంబులు నగుట కేమి
కారణంబు సుధాబ్ధి సంచార చెపుమ!. 162

వ. హరి యి ట్లనియె. 163

ఉ. వనజదళాక్షి దైత్యపరివారమునెల్ల నమర్షణంబుచేఁ
గనుఁగొన నయ్యె నీ యరుణకాంతి మదీయ విలోచనంబు లీ
యనువుగ నున్నరీతియు యథార్థతరంబుగ సాక్షిరూపణం
బును రచియింతు నింకఁ దలపోయక నమ్ముము నెమ్మనంబునన్. 164

వ. శ్రీదేవి యి ట్లనియె. 165

చ. జగములకెల్ల సాక్షి వయి సర్వమయుండవు నైన నీకునుం
[2]దగవగుసాక్షి యెవ్వ రిలఁ దామరసాక్ష యెఱుంగఁ జెప్పుమా
మగువలు ముగ్ధలౌదు రను మానము మానుపు మన్న నా సమీ
పగు లగు నింద్రుఁ జంద్రుని నభస్వదనంగుల నుగ్గడించినన్. 166

వ. శ్రీదేవి (మఱియు) ని ట్లనియె. 167

చ. చపలత నర్ధరాత్రికడ సంయమివర్యునిపంచఁ జేరి నీ
చపుఁగృకవాకుచందమున శబ్ద మొనర్చియు గౌతమాంగనం
గపటము చేసి కూడె నటు గాక జగం బెఱుఁగంగ గోత్రభే
దపునటకుండు నీకుఁ దగు తథ్యపుసాక్షి బిడౌజుఁ డచ్యుతా! 168

చ. జనకుని వెల్లఁబుచ్చి సహజాగ్రహవాటికిఁ జే టొనర్చి వం
చన గురుపత్నిఁ జెందియు నిశాచరుఁడైన కళంకదేహి పు
ట్టిన సుతుతోడ వైరము కడిందిగఁ బూనుచునుం బ్రదోష మం
దున నవతారమైన బహుదోషి నిశాపతి సాక్షి కర్హమా. 169

1. చ. సమన్వితంబులగు 2. దగియగుసాక్షి.

వ. మఱియు గంధవహా నిందితంబు. 170

ఉ. చంచల రీతి లోకపరి ౹ చారకవృత్తి సమస్తమానినీ
వంచకుఁడయ్యు మర్మము ల ౹ వశ్యము లంటుచు నుండుఁ గానరా
వించుకయైన సద్గుణము ౹ లీతనియందు గణింపఁ గంచుకీ
సంచయభుక్తమై తనరి ౹ చావక చిక్కె సమీరుఁ డారయన్. 171

ఉ. వావిరిఁ బూవుటమ్ములను ౹ వారక చెల్లెలుఁ దల్లికూఁతురుల్
భావముఁ దక్కి యెల్లపుడు ౹ పాలసువృత్తిని నేర్చుచుండి యా
పోవక మానభంగ మయి ౹ పోడిమి లేక చరించు నీగతిన్
వావి యెఱుంగనేరని వి ౹ వర్ణుఁడు భావజుఁ డెన్నిభంగులన్. 172

క. కొరగాని యట్టి కుహనా
పరివారము మీకుఁ గలదు ౹ బహుసాక్షికి భా
సురముగ నెల్లపు డదియే
వెరవుగ నటియించుమా వి ౹ వేకధురీణా !. 173

వ. హరి యి ట్లనియె. 174

ఉ. శతమఖముఖ్యులైనబహు ౹ సాక్షులనెల్లఁ దిరస్కరించి ప
ల్కితి వికనెద్ది యైనఁ బరి ౹ కింప నుపాయ మెఱుంగరాదు స
మ్మత మగునట్లుగా నొక ప్ర ౹ మాణ మొనర్చెద నన్ను నప్పుడున్
జతురతరాప్రమేయగుణ ౹ శాలివి నీపరిమాణ మెట్టిదో. 175

వ. హరి మఱియు ని ట్లనియె. 176

చ. సలిలభర ప్రవాహమున ౹ సత్యముసల్పెద జాతవేదకీ
లలవడిఁ జొచ్చి నేను మృదు ౹ లంబుగ వచ్చెద ఘోరసర్పముల్
వలనుగఁ గేలఁ బట్టెద ధ్రు ౹ వంబుగ నమ్మిక దోఁచునట్లుగా
సలిపెద బాస చంద్రసహ ౹ జా జలజాయతచారులోచనా !. 177

వ. శ్రీదేవి యి టనియె. 178

ఉ. వారిధి మధ్యమందిర మ వశ్యము నొంది దవానలంబునన్
వారణచేసి క్రూరతర పన్నగరాట్పరితల్పమందునన్
ధీరతఁ బవ్వళించుటయు దేవరవారికి నైజకృత్యముల్
గారడి చూప నేమిటికిఁ గాంతలచెంతల వింతగా హరీ! 179

వ. అనిన హరి యి ట్లనియె. 180

చ. సరసిజపత్త్రనేత్రి నెర జాణవు నీవు నసత్యముం దిర
స్కరణ మొనర్చి పల్కినను సాహసవైఖరి దూఱితి తౌ బళీ
పరమతరాంతరంగలు కృ పారహితల్ తరుణుల్ తలంప వే
గిరముగ నీదు కోర్కె యొఱఁ గింపుము తద్విధ మే నొనర్చెదన్. 181

వ. అనిన. 182

ఉ. శ్రీపతి నాదరంబునఁ గు శేశయమిత్త్రునిఁ గర్మసాక్షి ను
ద్దీపితలోకలోచనునిఁ దిగ్మకరున్ భువనాప్తు వేదవి
ద్యాపరిచర్య నర్యము న హఃపతి సాక్షి యొనర్పుమీ తిరు
కాఁపులు పుత్తు నంచుఁ బలు కన్ హరి హర్షకటాక్షవైఖరిన్. 183

ఉ. భావమునం దలంచినవి భాకరుఁ డేఁగఁగఁ దూర్పు నెఱ్ఱగాఁ
గావిరిపాఱ నంతట శు క ప్రకరార్భటు లుల్లసిల్లఁగాఁ
గోవెల నెల్లెడం జెలఁగి కూయఁగఁ బుష్కరగేహ చయ్యనన్
గావలివారినిం బిలిచి కాపులు దీయ ననుజ్ఞ యిచ్చినన్. 184

వ. అంత. 185

క. రాజప్రేరిత లై పుర
రాజానన లెల్ల దేవ రాజున కొగి నీ
రాజనము లొసఁగి పూవులు
లాజలు నక్షతలుఁ జల్లి లాలనచేయన్. 186

క. పొలయలుక మాని యొయ్యనఁ
గలుముల జవరాలు విభునిఁ గన్గొని కౌతూ

హాల మలరఁ గలసి కాంతుఁయుఁ
దళుకొత్త వినోదరీతి ఽ దనరఁగ మఱియున్. 187

సీ. శ్రీకాకుళాహ్వయ ఽ క్షేత్రంబునందున
రచియించు సుకృతంబు ఽ రమ్యముగను
కొంచెమైననుగోటి ఽ గుణితమై యొప్పఁగ
నచ్చటఁ జేసిన ఽ యఘములెల్ల
నప్పుడె నశియించు ఽ ననుమానమే లేదు
హరికృతంబులు విన ఽ నఘహరములు
ఈ ప్రకారంబున ఽ నెసఁగు కాకుళపతి
మాహాత్మ్యమనెడి ఽ యామహితమైన

వల్లభాభ్యుదయ మిది ఽ వలను మిగుల
వినినఁ జదివినవారికి ఽ విభవయుక్తి
నాయురారోగ్యసంపద ఽ లతిశయిల్లు
నిందిరానాథుకరుణఁ ఽ జెన్నొంది యెపుడు. 188

మ. హరినారాయణవాసుదేవ నరసిం ఽ హానంద గోవింద శ్రీ
ధర దామోదర చక్రపాణి యనుచున్ ఽ ధ్యానంబుఁగావించు న
న్నరజాలంబున కిష్టవస్తుఫలసం ఽ తానం బొసంగున్ దయా
పరుఁ డాద్యంతవిహీనుఁ డచ్యుతుఁడు గీ ఽ ర్వాణార్చితాంగుం డిలన్. 189

గీ. హితము మెఱయసూతుఁ ఽ డీప్రకారమ్మున
నానతీయ శౌన ఽ కాదిమునులు
విని ముదంబుతోడ ఽ విశదంబుగాఁ గాకు
ళేశుభక్తిఁ బొదవి ఽ రెలమి మిగుల. 190

మ. అనిశధ్యానమునీంద్రలోకహృదయా ఽ బ్జాధిష్ఠపాదారవిం
దనతానంద జగన్నివేశవరదుం ఽ డాదుర్జనశ్రేణిఖం

డనచక్రాసి గదాదిసాధనసుకృ ష్ణాకూలదేశాశ్రితా
స నరాధీశ్వరపూజతాంఘ్రియుగ సం సారార్ణవోత్తారకా. 191

క. శ్రీరమ్యతర భుజాంతర
నారదతుంబురసుగాన నందితగంగా
తీర శరణ్య సమాగత
వారిజ భవ రుద్రగేయ వల్లభరాయా! 192

స్రగ్విణి. శ్రీరమా వల్లభా క్షీరవారాశి సం
చార ఘోరాబ్ధి సం సారరత్నాకర రో
త్తారపాదారవిం దానతానీక మం
దార బృందారకా ధారనారాయణా!

గద్య. ఇది శ్రీమత్తిరుమల తాత గురు గురుచరణారుణాబ్జయుగళ సమాశ్రయణ దురితలతాలవిత్ర, హారితసగోత్రపవిత్ర భట్లపెనుమర్తికులోద్భవ గోపాలసచివతనూభవ విద్వజ్జనవినుతాభిరామ కోదండరామప్రణీతంబైన బ్రహ్మాండపురాణోత్తరఖండంబున వల్లభాభ్యుదయం బనెడి శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

గీ. విక్రమాఖ్యాబ్ద కార్తిక విశదపక్ష
పూర్ణమాసికి వల్లభా భ్యుదయమెల్లఁ
బూర్తిగ నొనర్చె భట్లపెన్ మర్తివంశ
రత్న మీభువి కో దండ రామసుకవి.